శ్రీ రస్తు.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

# శ్రీ అధ్యాత్మరామాయణ కీర్తనలు.

ఇయ్యది

## శ్రీసుబ్రహ్మణ్యకవి విరచితము.

బజారుపుస్తకమునవలెగాక తప్పులు సవరణచేయబడినది.


రాజమండ్రి బుక్కుసెల్లరు

## కర్రా అచ్చయ్య అండుసన్సు

వారిచే ప్రకటింపబడియె.

కాకినాడ:

స్కేప్ అండుకో ముద్రాక్షరశాలన్ముద్రితము.

1920.

శ్రీరస్తు.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# శ్రీ అధ్యాత్మరామాయణ కీర్తనలు.

ఇది

## శ్రీసుబ్రహ్మణ్యకవి విరచితము.

బజారుపుస్తకమునవలెగాక తప్పులు సవరణచేయబడినది


రాజమహేంద్రి బుక్కుసెల్లరు

కర్రా అచ్చయ్య అండుసన్సు

వారిచే ప్రకటింపబడియె.

కాకినాడ

స్కేప్ అండుకో ముద్రాక్షరశాలన్ముద్రితము.

1920.




[వెల రు 0-8-0



శ్రీ వేఙ్కటేశాయనమః

# శ్రీమదధ్యాత్మరామాయణ కీర్తనలు.

## బాలకాండము.



### ౧. ధన్యాసి - ఆదితాళము.

పల్లవి - నమశ్శివాయ నమోభవాయ.

అనుపల్లవి - సమానాధికరహితాయ కాంత-స్వప్రకాశాయ
ప్రమోదపూర్ణాయభక్తౌఘ-పాలనాయ॥ నమ॥

చరణములు-గర్వితదానవలోక-ఖండనాయ।శ్రీరజత।పర్వతాగ్రి
నిలయాయ-పావనాయ।సర్వలోకపాపపుంజ-నిర్వాపణాయ-శర్వాయ।
దర్వీకరభూషణాయ-సర్వోత్తమాయ॥ నమ॥ ౧

అండజాధిపవాహన-కాండాయ మేరుశైల కో। దండాయ శితి
కంఠాయ-పండితాయ।మండితత్రిపురజయో ద్దండ- తాండవాయ బ్ర।
హ్మాండనిలయాయ మహా-మాయాతీతాయ॥ నమ॥ ౨

మందహాసవదనారవింద-సుందరాయ యోగి। బృందానందకా
య శత్రుభీకరాయ।ఇందుసూర్యాగ్ని నేత్రాయ-నందితప్రమథగణాయ।
నందివాహనాయ పోషిత-బృందారకాయ॥ నమ॥ 3

నిరుపమానందఘన-నిశ్చితాయ శాశ్వతాయ।వరదాభయకరా
య-గిరీశాయ।తరుణేందు శేఖరాయ-పరమపురుషాయ భవ।హరణాయ
శ్రీకాళ-హస్తీశ్వరాయ॥ నమ॥ ౪

గంగాభంగతరంగసంగత జటాజూటాయ। సంగీతలోలాయశుభసంగతాయ।అంగజాంతరంగమద - భంగాయస్ఫటికోపమాంగాయశేషశైలాధీశమిత్రాయ॥ నమ॥ ౧

౨. రేగుప్తి-ఆటతాళము.

పల్లవి - ఈసంశయమువారింపవే పర-మేశ నన్నుమన్నింపవే.

అనుపల్లవి-శ్రీసదాశివప్రశ్న-జేసెదవివరింపు। వాసుదేవత-త్త్వమహాత్త్వము।భాసమానవిలాసనేనిదే-నీసత్కృపావలోకమున।నీసమయమునదెలియవలసిన-దేసమస్తమిదే ప్రశస్తము॥ఈ॥

చరణములు - జ్ఞానవిజ్ఞానని-శ్చలభక్తివైరా। గ్యానందములకు ని-ధానమైనవిన్న।శ్రీనిలయమైవెన్నవలె-మృదు వైయసమానమైనుతిగన్న-మార్గముమిన్న।యైనబహుగోప్యతర-మైనయనూనముగ సెలవిమ్ము చంచలత। లేని తంవినులకు నీదానదానవ-వైరిముకుంద॥ ఈసంశయము॥

వారిజాక్షుగదా ధారమూర్తియైన।రామునియందు-సారసద్భక్తి కారూఢమైముక్తి-కారణమైయల।రారునెక్కుయుక్తినాదిశక్తి। మీరరసిధీరసికాళికి-సారకళలూరంబలుకుము భవ।నీరధికితారకముభక్తి-మీఅనుజనులువేఱెలేరని॥ ఈసంశ॥ ౨

దేవశ్రీరాముని దేవదేవుగాప-డ్భావాతీతునిగానుధీవరులెల్ల।భావమురంజిల్లంబల్కుదురతని-భావింతురదియెల్లఁగల్లగాదె।గావునను శ్రీవిభుఁడుముక్తికి-కేవలముతావలమైనను।శ్రీవెలయుభూవలయమునఘనచాపుఁడై-జీవుఁడైనదేమి॥ ఈసంశ॥ ౩

మాయావృతుఁడైరామస్వామిసన్ముక్తి-దాయకునిగనుతనుదాఁదెలియలేఁడు। వేయేలనలెఁడుజూడు ఆత్మను తత్వ-వేత్తలకేనేఁడు దెలిసినాఁడు। మాయికుడటందురొకకొందఱ - దేయథార్థము నేయుసు

జన । ధ్యేయుఁడెటులగు నై నజానకి-కాయెడలఁదానడలనేటికి ॥ ఈసం
శయము ॥ ౪

ఈవాక్యములకర్థమీావు గాకితరులు-భావించిపలుక నేర్పరులెవరు
లేరు। దేవు-డవై చెలువుమీారు-నిన్ను జేరు-ధీరాత్ములుగోరు - కోర్కె-లీడే
రు। ఈవసుధ శేష శైలాధిపుఁడై వెలుఁగురా-సుచరితముసుధావర్షమై చె
వులపంపు-గావించు సేవించు జనులకు॥ ఈసంశయము॥ ౫

3. భైరవి-అటతాళము.

పల్లవి - వినవే సత్యవాణి శర్వాణీ అలి-వేణిసిరజపాణీ॥

అనుపల్లవి-ననుగోరిభజియించి-ననుమదిలోనుంచి।నను, వరదుఁడనౌదు
సంశయములేదు।మునుపుఇట్లలిదియుసుగరెవ్వ-రును మహా
యోగివరసంభావ్య వనముజీవన మమృతసే-వనము జన్మ
పావనము॥ వినవే॥

చరణములు - శ్రీరామునకు నమస్కా-రము-చేసియసివారణనా
త్మ-తత్త్వమునీకు వివరింతు। నారాఘుపుఁడుశౌరియజ్ఞానహారిజి-తారిశ్రీవి
హారిమాయాంధారి।తారకకీర్తిస-త్యజ్ఞానస్ఫూర్తి।దారితార్తి దేవతాచక్ర
వర్తి చిదానందమూర్తి।మైరాజులుశ్రీ-హరిమాఁదుకెల్లనా।భారమైనం
దువల్ల- మోహముకల్ల।ఆదిపరికృతికినాదినిజమా-యానూషిగములుసృ
జించి య। నారతమునభముగతివెలిలోనుపూ-ర్ణతనుబూను॥ విన॥ ౧

వితతమాయచేని-ర్మితమైనజగముబ।స్మృతిసూచిచుంబిత-శిలచే
బరిణమించు।గతియొకర్తృత్వము-అతనికిలేదుసు।ర్మతులెఱుఁగరీ మాదిరి
కోర్కు-లుమీాఱ।మతిహీనులైరిమే-మనవచ్చువారిసం।స్మృతియెకోరియుం
దు-చేబద్ధులైరియామధుకైటభారి।అతిశుద్ధచిద్ఘనుం-డని తెలియ జ్ఞాన-
మతనికిగలదందు। మహిలోఁ గొందఱు తతవసుమ్యతిలసన్మాలిక నుత
గళా-న్వితమయ్యు మఱచిన।గతిమనస్థుఁడాదిసద్గురుని - ఖలు లెఱుంగ
రని॥ విన॥ ౨

అకటా సూర్యునియందు అప్రకాశత్వము। యొకనాటికైనను ఉ
న్న దేయటువలెనే। ప్రకటమైజ్యోతిస్స్వ-భావమాత్మునియందు। పని లేదు
మాయనా-ఘనినీవికమీఁదు । అకలంకగన వేని-త్యమునమ్మిమన వేర ।
క్షుకుఁడన వే శేష శైలేశు-గనవే భక్తియుచేకొనవే। అకుటిలనయనచాం
చ-ల్యము చెప్పుటలుచలదృ-ష్టికిచూడనునికిపట్లు- భ్రాంతమైనట్లు। సకల
కాలములను ప్రభామాలికిగడలాత్రి లేనటులా - త్మకునుజ్ఞానాజ్ఞాన
ములు-రెండు లేనివైయుండు॥ విన॥ 3

౪. కేదారగౌళ-ఆదితాళము.

పల్లవి - సీతారామమారుతిసంవాదము చేరిన వేదము శ్రీ॥

అనుపల్లవి-సీతాంశుముఖియా చరితమునందలి । చాతుర్యము చూడు
సంశయముపీడు।ఖ్యాతిగమును దశకంఠుని రవికుల।జాతుఁ
డైనరఘురాముఁడు సబల-వ్రాతముగనుజంపి శస్తుఁడై। సా
కేతపురి జేరియున్న తఱినినడచిన॥ సీతా॥

చరణములు- హాటకసింహాసనమునరాముఁడు-కోటిసూర్యసమ
కాంతిని వెలుఁగుచు।పాటలాధరధరాసుతతోడను- పరగవసిష్ఠాదిగురుబు
ధమిత్రి।కోటిసేవింపనాదినారాయణుఁడై - మేటిభక్తానుమోదికమలా
వినోది।దీటు లేక కొలువుండిహనుమంతుమనసు - దెలిసిసీతనుబలుకుమన
ముద్దుగులుక।మాటికిభక్తాగ్రణికృతమతి-సాటిలేని శౌర్యధైర్యఘనుఁడు
ను।మేటివైనయనిలసూనుఁగనుఁగొని- తేటముగానులోకమోహిని పలి
కెను॥ సీతా॥ ౧

రాముఁడు పరమానందమయుండుస- ర్వచరాచరపరిపూర్ణుఁడ
వ్యయుఁడు।సామగానలోలుఁడచలుఁడాద్యుఁడు-సర్వసాక్షిసుమ్మివినిర్మ
క్తకాముఁడి।దినిజమ్ముపరమాత్ముఁడనుచు-వేమారుదెలిసి కొమ్ముభక్త
లసొమ్ము।సామీరిసంశయమెల్లనుపోఁజిమ్ము- నామాటమదినమ్ముధీనిధి
విగమ్ము।ఏమనవలెనేమూలప్రకృతిని- ఈమహాత్మునన్నిధానమాత్రను

ఈమహాద్భుత। ములొనర్చుమూఘులు - స్వామియందునారోపణసేయ
కనె॥ సీతా॥ ౨

ఈకోసలపురిలోరాముఁడై దశరథునకు - ఇతఁడు బుట్టుటయువి
శ్వామిత్రియాగము।సాకల్యముసేయుటయు నహల్యకు - శాపముఁబా
పుటయువిల్లువిరచినన్ను।చేకొనిచెలఁగుటయు పరశురాముని- ధాకయ
డంచుటయుఁ బురిఁజేరుటయు। కైకపనుప దండకాటవి కేఁగుట - పాకట
మాయాసీతహ్రుతియందుచేత।శ్రీకరురవిసుతుఁ జేరి-వాలిసటుఁజేరివారిని
ధిగట్టి రావణుని।భీకరాజిచంపి మిన్ను గైకొని - సాకేతముఁజేరుటెల్లమ
త్కృతియను॥ సీతా॥ 3

ఆరాఘవునియందీవిధమజ్ఞాను-లారోపణసేయుచురుమధుకైట।
భారినిర్వికారుఁడఖిలాత్మకుఁడు -పరిణామరహితుఁడుబ్రహ్మమేయితఁడు।
సూరిబృందనుతుఁడుఆనందయుతుఁడు - భూరిభువనహితుఁడుసకలసమ్మ
తుఁడు।కారుణ్యానైఘృణ్యహేయోపాధేయ సుఖదుః-ఖగమనాగమనాది
ద్వంద్వములు లేవి। శ్రీరమణియునకీవిభునెఱిఁగిన - వారిఁజేరి వెఱచిమా
యాపరువి।దారితారి శేషశైలశిఖర - హారిఁజేరి కడతేరుదారియిది॥సీ॥ ర

౫. సావేరి-ఆదితాళము.

పల్లవి-వినుమనిశ్రీరాముఁడుతాఁబలికెను - విశదముగను జేరి ॥
అనుపల్లవి-జనకజచేవిన్నయనిలజునికిజ్ఞాన।
జనకమౌనట్లుగానుమోదముతోను॥

చరణములు - సమతనుఆత్మానాత్మపరాత్మల-జాడలుత్రివిధము
లుపవనజ । మమతాహంకారకర్తృకార్యములవల్లన - మఱినయదియా
త్మ।రమణనస్మృతజడదుఃఖములను నీరసముయినదియనాత్మ- నిత్యము।వి
మలము సత్యజ్ఞానానందా-త్మికమిదియెపరాత్మమహాత్మా॥ విను॥ ౧
ఆకాశముత్రివిధంబయినట్లుప-రాత్మత్రివిధమాయెఁదెలియంగ।
నేకముగానువరాకాశముజలా - శయబింబితమయిన। చేకొనితదవచ్ఛి

న్నాకాశము-చెలఁగిభిత్తియందునెంతయు। ప్రకటముగనిటుప్రతిబింబిత
మై-ప్రబలినదీచాయశ్రీయాంజనేయ॥ విను॥ ౨

చాతురిమీఱి యఖండాద్వితీయ-చైతన్యమువలన బింబభూతుఁ
డైత్రివిధాహంకారవిరా-ట్పురుషుఁడు చూపట్టె। అతనియందాభాసరూ
పమయి-భూతేంద్రియమనోవృతమై। ఖ్యాతిగాంచి జీవాత్మయనఁదన
రెఁ-గనుఁగొనుమీజాడ క్రమముతోడ॥ విను॥ 3

గుణమయమాయకర్తృతయనహాసం - గినజీవత్వాదిమలినము
లు। గణుతింపనవిచ్ఛిన్నమైనయవి-యాపరాత్మయందు । ననయమునను
నారోపణసేయును-రజ్ఞానులుభువిలోనెఱుఁగక । యనిశముశుక్తిరజత
మనిభ్రమయులే - యాభాసమనదగును దెలియనగును॥ విను॥ ౪

చెలగునవిచ్ఛిన్నతబ్రహ్మమువి-చ్ఛేదమకల్పితముఁ గావున। నలభి
న్నునకుపూర్ణాత్మకుఁడైక్యము-వలననుసుజనులచే। నలఘుతత్త్వమస్యా
దిమహావా-క్యములచేఁబ్రకటమైయలరెను । వెలయఁగనైక్యమునుజ్ఞాన
ముగల్గన-విద్యమాయవానుగుణములతోను॥ విను॥ ౫

పావనులైయీక్రమమెఱిఁగిమ-ద్భక్తులుమత్పదము జెందుదురు। రీవ
సుధనుభక్తివిహీనులుగ-ర్వితులైదుర్మతులై। కేవలమునుశాస్త్రకర్మము
లఁబడి-కెరలిభవశతములనొందుచు। భావముచెడిసుజ్ఞానదూరులయి-పో
వుటనిశ్చయమునీకేమిభయము॥ విను॥ ౬

పరమమైనయీయుపదేశముగో-ప్యమిదిభక్తిలేనివారి । కరయ
నిండ్రరాజ్యమొసంగినని-య్యకుమిదిభవహరము । గరిమనఖిలవేదాంత
సారసం-గ్రహముశుభావహముకనుఁగొను । సురుచిరశేషాచలశిఖరని
వా-సుఁడనైభువిలోనువెలసినాను॥ విను॥ ౭

౬. కాంభోజి - ఆదితాళము.

పల్లవి-నేధన్యుఁడైతినే జగత్ప్రభో - సాధులోకవిభో॥

అనుపల్లవి-మాధవచరణారవింద - మకరందముఁగ్రోలఁగలైె॥ నేధన్య॥

చరణములు-మునుమిడిసంశయమనే - ముడివీడె యనుగ్రహా।
మున రామతత్త్వముసంక్షేప - ముగవింటిగడతేర గంటి। మనసుతనివి
దీరదాయె - మన్నింపవే దైవరాయ। అనునందనినుఁజేరమాయ-య
తిదూరమై తొలఁగిపోయె॥ నేధన్య॥ ౧

అద్వితీయాఖండపరిపూ - ర్ణానందవారిధిలోన। చిద్విలాసోల్లా
సినై రం - జిల్లఁజేసి నన్నుడాసి। హృద్వికాసమొనరించి హితవా -
క్యములుపదేశించుటచే। విద్వన్నుతశంకరవి - శ్వేశశంభో మహా
దేవ॥ నేధన్య॥ ౨

స్వామీనేనీచేవిన్నయీ - చరితమునవరసభరితము। వేమారు
దీనివినఁబల్కు-వీను లమృతముజిల్కు-శ్రీమహిళా। భిరాముఁడైనశ్రీ రా
మునిదేవతాసా-ర్వభౌమునినీవలనదెలిసి॥ నేధన్య॥ 3

౭. గౌళిపంతు - ఆదితాళము.

పల్లవి - వినుముధరాధరవరతనయా ధృత - వినయా సరసగుణాతి
శయా॥

అనుపల్లవి-చనువుమీఱనన్నడిగినయీశుభ -
చరితముహతదురితముమది నిరతము॥ విను॥

చరణములు-రావణాదిదుష్టాసురకోటుల - మోవలేకభరపీడిత
యైభూ। దేవివిమలగోరూపముగైకొని-శ్రీవిలసిలుబ్రహ్మలోకిమునకు।
ఠీవిగనేగివిరించిచరణారా - జీవములకుశ్రుకణమ్ములఁదడపుచు। సావధాన
ముగ మొ్రక్కి-వినతయై-తావచ్చుట విసిపించెవిశదముగ॥ విను॥ ౧

వనజభవుండొకముహూర్తమాత్రము - మనమునసంతయునూ
హచేసిక్రొ। న్ననవిల్తునితండ్రి గనుఁగొనుటకు- మునిసురపరివృతుఁడై

భూసహితము । గనుచని క్షీరసముద్రతీరమున-ననుపమ భక్తివినమ్రు
డైనహరిని । వినుతించెను వేదాంత వాక్యముల ఘన - వినయానంద
ములుపురిగొన॥ విను॥ ౨

కోటిసహస్రాంశుసమప్రభచే - మాటికిదిక్కులు తేటగసేయు
చు । హాటకాంబరముకటిపై వెలుగ కి-రీటహారకేయూరకాంతులు ల।
లాటకంఠబాహువులనుదనరగ- మేటికౌస్తుభశ్రీవత్సములకు । నాటప
ట్టయిచతుర్భుజుడగుచుని - శాటపైరిగనుపట్టెమోదమున॥ విను॥ 3

గరుడవాహనారూఢుడుకమలా-ధరణీయువతి యుగళ యుతు
డుశంఖ । రథాంగగదాపద్మవిరాజితు- డురుతరవనమాలికాభిరాము
డు।తరణితేజవిశాలలోచనుడు-పరమామృతకరుణాలోకనుడగు । హరి
చరణద్వయిశిరముసోకగను-సరసిజగర్భుడుమ్రొక్కి-పలికెనది॥ విను॥

తనువుమనసుప్రాణములింద్రియములు - వినుతనిశ్చయాత్మికయ
గుమతితో । మొనగూర్చిభవత్పదవినతుడనైతిని - నినుహృత్పుండరీక
మునకును । గొనినిరతానందానుభవంబున - నెనయువారుభవరహితు
లభవత్రిభు । వనములపుట్టిపెరిగి గెడయుటిది సీ-ఘనమాయగదా!యనె
పితామహుడు॥ విను॥ ౫

సూరిజనులువేదాంతమునందలి - సారవిచారముచేసి ఘోర
సం । సారరుక్పిడితులౌషధంబు - దారభక్తి యనివల్కిరి గానయ ।
నారతమదిదయజేయుమనినవిని - శౌరియజుని కరుణార్ద్రదృష్టిచే। నార
సినీయభిమతములొసంగుదు-గోరుమనిననుత్సుకుడై పలికెను॥వినుము॥

శ్రీలలనాధిప చిత్తగింపుమీ-భూలోకమునను రావణుడనగా।
పౌలస్త్యసుతుడొకడుగడు సువి - శాలమైతగుమదీయవరంబున । మే
లుజెందిసురకంటకుడై కడు - వాలియున్న వాడనికిమర్త్యుని । చేలయుం
బువిధియించితిదనుజుని - లీలామనుజుడవైవధింపుమనె॥ వినుము॥ ౭

వనజోదరుఁడిట్లనియెనుకశ్యప - మునిమునుననుతనయునిగమ్మని
వే। డినకులమునదశరథుఁడై వాఁడా। ఘనునకుకౌసల్యకుపుత్రుఁడనై।
జనియించెదనిజయోగమాయయె। జనకుని యింటనుసీతయగునుపొ-
మ్మనిచక్రితిరోధానమునొందెను॥ విను॥ ౮

సురలకునిట్లనియెనుచతురాస్యుఁడు-హరివాక్యము లెల్ల వింటిరే
వా। నరులసృజింపుఁడు మీయంశములను - పరమేశునకుసహాయము
సేయుఁడు। పరమసమ్మతంబగుననుచువసుం - ధరనూరడించినిజనివా
సమున। కరిగెనలువ శేషాచలవాసుని - శరణాగతవత్సలుఁడని పొగ
డుచు॥ వినుము॥ ౯

౮ కన్నడ - ఆదితాళము.

పల్లవి-అందముగనీకథవినవే రజ - తాచలసదనా పరిహసితవి।
నిందితారవిందచంద్రవదనా-కుందబృందసుందరరదనా॥
అనుపల్లవి-మందయాన దశరథవసుధేశుఁడు మాన్యయశుఁ డయో
ధ్యాకాంతుఁడు। పొందుగఁదనయులు లేనందుకువగజెందివ
సిష్ఠునిజేరిపల్కెనా॥ నంద॥

చరణములు-మనవివినుము స్వామీ నాకిఁక శ్రీ-మంతులైన సు
తులు ఏవెర। వునజనియించెదగాత్మజహీనునకు-ధనంబుసుఖకరంబుగా
దుగదా। అనినరాజుకనియెనావసిష్ఠుఁడు-జననాయకనీకుకొడుకులు। ఘ
నులమలయశోధనులునల్వు రిక - గల్గెద రందుకుపాయము గలదనె॥
నంద॥ ౧

శాంతుఁడైనఋశ్యశృంగమౌనీ శ్వరునిబిలువనంపుమీవు ని।
తాంత పుత్రికామేష్టి నిరంతర - సంతోషస్వాంతుఁడ వైయొనరింపు।
మంతయుఁద్వరగా ననుడును శాంతా - కాంతుని రావించిరపు డు।
ద్దాంతుఁడుముని పరివృతుఁడై సరయువు - చెంత యజ్ఞదీక్షచేకొనిని
లిచె॥ నంద॥ ౨

వేదమంత్రములు పలుకుచు శుచియై-వేల్వ హుతవహుఁడుహ
వ్యము । సాదరమునఁ గైకొని తనప్రదక్షి - ణార్చులలర జ్వలియించె
ననుపప్రభుండై । భేదహరుఁడు యజ్ఞేశుఁడు దశరథ-మేదినీశ్వరునకుశు
భమిం । పారఁగఁ దాపాయసపాత్రి మొసంగి - పరమాత్ముఁడుసుతుఁ
డగునీకనిచనె॥ నంద॥ 3

లలితలరిరిమానులు లబ్ధమనో-రథుఁడై దశరథుఁడు ముదమున।
జెలఁగుచుఋశ్యశృంగవసిష్ఠుల - చేననుజ్ఞగొనిహవిస్సువేడుకను । కలి
తగుణుఁడుకౌసల్యకుసగమును - కైకకు సగమొసంగవారలు । దెలిసి
సుమిత్రికుదమయంశములం దెమ్మె - సగముసగమొసంగిరి నిరతా॥
నంద॥

పరమాన్నముభుజియించినమువ్వురు - తరుణులుగర్భిణులైవెలి
గిరి । నిరతముసురకాంతలనఁదొమ్మిది - నెలలునిండకౌసల్యగనెను సు
తుని । పరగఁజైత్రశుద్ధనవమినిపున - ర్వసునక్షత్రముననుమనో । హ
ర కర్కటకలగ్నముననను శే - షాచలేశుఁడగుహరిజనియించెనా॥ నంద

౯. శంకరాభరణము - అటతాళము.

పల్లవి-శ్రీరామునిగాంచెనుపార్వతీవినవే-
మనకౌసల్యయా - త్మారామునిగాంచె॥
అనుపల్లవి-తోరమైహర్షాశ్రు - పూరముకన్నుల।
జారభయసంభ్రమా - శ్చర్యముల్బెనఁగొనంగా॥ శ్రీరా॥

చరణములు - అలనల్లకలువరేకుల చాయమేనిచేఁ - జెలఁగు
వానిపసిడిచేలఁగట్టినవాని । వెలయునాల్గుభుజములవానికను గొ - లుకు
లనరుణరేఖలుగలవాని స్వర్ణ కుం । డలలసితగండమండలములనుర - స్థ
లిరచితరవికోటిప్రకాశునిరత్నో - జ్జ్వలకిరీటమువాని నళినీలకుటిల
కుం - తలములచేముద్దుగులుకుచుండెడివాని॥ శ్రీరా॥ ౧

ఘనతరశంఖచక్రగదాబ్జములవాని - వనమాలికయురుత దన
రువానిచిఱున । వ్వనువెన్నెలలావదనచంద్రుడుదిక్కు - లనువెదచ
ల్లఁజెల్వాలరారెడువాని । ననుపమానకరుణామృతపూర్ణనే - త్రునిమం
జీరాంగదశ్రీవత్సకటకకం । కణహారకేయూరకౌస్తుభాది భూ - షణ
భూషితునిఁజూచి తనివితీరక తిరుగ॥ శ్రీరా॥ ౨

శరణాగతులను కరుణరక్షించు శ్రీధరనీకు - బహువందనము
లొనర్చెద । శరణుగర్వితదనుజచయవిరామరామ - శరణుదేవతాసా
ర్వభౌమనీవే । పరమాత్ముఁడవు జగత్పతివీశుఁడవుహరివి - వరయోగి
బృందహృద్వనజకర్ణికాం । తరమున సురుచిరరాకజ్యోతివె - మెర
యునిన్నెన్ననా తరముగాదనితిరుగ॥ శ్రీరా॥ 3

ఈశనీవునిఖిలేంద్రియసాక్షివి - శ్రీశుఁడవీవిశ్వసృష్టి సంరక్షణ।
నాశములొకటనుజేసిసేయకయున్న - వాసిచేఁబొలుపొందనివాఁడవైప్ర
కృతి । డాసిడాయనివాఁడవై శాశ్వతుఁడవై యా - కాశాదిభూతసం
ఘములకెల్ల నవకాశ । మైనీవు ప్రకాశింతు విదిమాయా - పాశబద్ధు
లకెఱుఁగవశముగాదనితిరుగ॥ శ్రీరా॥ ౪

నీజఠరమునందనేకబ్రహ్మాండములీ - రోజంబర మాణువులై
యున్నవిప్పుడునీవు । రాజిల్లునాయుదరమునఁబుట్టుటకల్ప - భూజము
ముంగిట మొలచినట్లయ్యె నం । భోజాక్ష! పతిధనపుత్రాదిసక్తనై -
నేజెల్ల సంసారనీరధింబడనెల్ల । శ్రీజాని నీశరణు చెందితి నామదిని -
తేజరిల్లుచును సుస్థిరుఁడవుగమ్మని॥ శ్రీరా॥ ౫

ఈయఖిలమును మోహింపఁజేయనీదు - మాయకునగుపడఁజే
యకుమ, శేష । శాయియీరూపముసంహరింపఁగదోయి - కాయజ
జనక చక్కనిముద్దుపట్టివై । హాయిగానన్నలరజేయుమమితానందదా
యువనినినుమదినిదలతుఁరఘునులెల్ల । మాయురే! యనుచువేమాఱు
నువినుతించి - శ్రీయుతమూర్తియా శేషాచలేశుఁడా॥ శ్రీ॥ ౬

### ౧౦. ముఖారి - ఆదితాళము.

పల్లవి-రాముని సకలగుణాభిరాముని-
నిఖిలరాక్షసవిరాముని వర్ణింపవశమా॥

అనుపల్లవి-వేమాఱుకౌసల్యనీవే - మేమిగోరినావదియెల్ల ।
శ్రీమీఱ నొసఁగితి ననుచు । ప్రేమ చేజననితోఁబలికిన॥రా॥

చరణములు-మున్ను బ్రహ్మానన్ను వేఁడ- కొన్న భూభారముదీర్పవ
న్నమీఱఁగను నేఁడునీగర్భమున - జెన్నలరఁబుట్టితిఁజూ^సు । రావణాసు
రుఁడన్ని టగర్వించినాఁడు వానివధియించి । నన్ను తిగాంతునీ రేఁడుజగము
లలోన - మున్నలరదశరథుఁడునీవునన్ను దప । మునమెప్పించి । కన్నా
రునీవదితియతఁడు - కశ్యపుఁడని కౌసల్యకుదెలిపిన॥ రాముని॥ ౧

అనుచుఁదల్లితోఁబలికి - హరిముద్దుబాలుఁడై కలికి । తనమున
హరినీలగాత్రుఁడై వికసితనవ్య - వనజదళవిశాలనేత్రుఁడై చక్కనివాఁ
డనుచుజను లెంచపాత్రుఁ - డై విలసిల్లెనంత । మనకుజూడఁదరుణమిత్రుఁ
విలసిల్లెనంత । ఘనుఁడైన తనయుఁడు గల్గెననివిని - దశరథుఁ డానంద।
మునను గురునితోడఁ గూడి - చనుదెంచికన్గొనెను శ్రీరఘు॥ రాముని॥

విరులవానలపుడుగురిసె । వేడ్కజయదుందుభులు మొరసె ।
సుర సుందరు లెలమినాడిరి - గంధర్వవరులు । సరసులై రాగములఁ
బాడిరి-మానులుదోషాచరులవలనిభయముపీడిరి - పౌరులానంద। కరు
నిజూడ గుమిగూడిరి - దశదిశలయందు । పరిమళమిళితములై తె -
మ్మెరలువిసరెదివినిసురలు । వరవిమానారూఢులయి శ్రీహరియని మ్రొ
క్కిరాత్మ॥ రాముని॥ 3

ఘననిభుడైనకొమరుని - గనెను కైకచంద్రబింబా । ననలను
సుమిత్ర - గనెనుసుతులనిర్వురను । మొనసినసంతోష-మునను దశర
థుఁడుసకల । ధనములవిప్రులదని - పెనువసిష్ఠమహా । మునియూ భా

ఉరకు క్రమము-నను రామభరతలక్ష్మణశత్రుఘ్ను । లనుచునామక
రణము-లొనరించెభరతుం । డును శత్రుఘ్నుఁడు జోడైరిలక్ష్మణుఁడు
ననుసరించెను దశరథ॥ రాము॥ ౪

చెలఁగిసౌమిత్రితోఁగూడి - మెలఁగుచుఁ జేవియలొలుకఁ । బ
లుకుసుతునినృపుఁడు గాంచిభూషణజాల । ములతోడనలంకరించిసిస్తు
కస్తూరి - తిలకమునుదుటనుంచిగళముననరత్న । కలితహారములుగీలించి
ముద్దాడునప్పుడు- కలకలనవ్వుచు మద్ది - కాయలల్లాడ నందియలు ।
ఘలుఘల్లనుచు మ్రోయ - లలితగతులనటించుచుశ్రీ॥ రాముని॥ ౫

చిన్నారి బొజ్జలోనన్నుఁ - గన్నవాఁడానాపాలిటి । పెన్నిధాన
మరారాయోరీనాచిన్ని । యన్నబూచివచ్చేరా - పరుగెత్తవల । ద
న్ననాతోనలుగమేలా-పాటబాడుచు । నిన్ను లాలియూచేరా - లాల
బోసేను । మన్నుచేతనంటవద్దువెన్న బెట్టెననుచుచాలా । మన్నించిప
లుకుకౌసల్యకు - మరులురెట్టింపఁజేయుశ్రీ॥ రాముని॥ ౬

ధరణివిభుఁడుభుజించు - తఱినికౌసల్యతనయుని । మురిపెమున
రమ్మనుచుజీర - వరయోగిహృదయాం । తరమునందుఁజెల్వుమీఱ-
వసియించుదేవుఁడు । చిరుతవాఁడయిముద్దుగార - వచ్చినజూచి । త
రుణిదనదుకోర్కులు మీఱ - కౌఁగిటనుంచి । కరుణించి భుజియించు
మనిన - కబళముచేనందుకొని । తిరుగానాటలాడపరుగె - త్తినమా
యాబాలకుఁడో॥ శ్రీరాము॥ ౭

వితతయశుఁడుదశరథభూ - విభుడంతటకౌమారాన్వితుల । సు
తులఁదిలకించి యుపనయనములు - నతులముగనొనరించి వసిష్ఠునొ
ద్ద । శ్రుతులనెల్ల జదివించి - చతురంగముల । గతులఁ దెలియనేర్ప
రించి చౌషష్టివిద్యల । చతురులనుగావించి హర్షించవారు । సతతము
గురుబుధమిత్ర జనులకెల్ల హితులైధైర్యో । న్నతులయిపరఁగిరందు
నాశ్రీ యుతుఁడయిసత్యవ్రతుఁడయిన॥ శ్రీరాముని॥ ౮

తల్లిదండ్రులకుప్రియము దనరగవశ్వము నెక్కి । విల్లునమ్ములు చేపట్టి వేఁటలాడుచు । మొల్లముగానడవినున్న ట్టిమృగ ములగుండెలు ఝల్లు । ఝల్లునఁజుట్టిముట్టిపోసికవానినెల్ల చలపట్టిపడఁగొట్టిసామిత్రి గూడి । బల్లిదుఁడైయున్నియయోధ్యా వల్లభునకు కాన్కఁజేసి । సల్లలితుఁడై సకలజనుల సవినయముగాఁబాలింప॥ శ్రీ॥ ౯

శైలరాజకన్యకా! యీ చందమునమనుజావతార । లీలమైవ ర్తించెశౌరి కనుగొనుమిందర్రి । జాలిదుఁడుచక్రధారి సమస్తవేద । మూలమైవిలసిల్లుదారి యజ్ఞులుదెలియఁ । జాలరతం డనిర్వికారి విమత సంహారి । శ్రీలచేజెలువందు శేషశైల శిఖరాగ్రవిహారణ । శీలుఁడైస ద్భక్తలోకపాలుఁడై దనరునిత్యాత్మా॥ శ్రీరాము॥ ౧౦

౧౧. నాదనామక్రియ - అటతాళము.

పల్లవి-ఇందువదనా! వినవె యీచరితము - నిందువదనా॥

అనుపల్లవి-డెందముశ్రీమన్మ - కుందునిపాదార ।
విందములందానందింపఁజేసి రా॥ కేందు॥

చరణములు-ధీరుఁడువిశ్వామిత్రుఁడు తానయోధ్యకు శ్రీరాముని జూడవచ్చెనని । వార్యుఁడై సౌధముఁజొచ్చెను ఎదురు గారాజు చనితోడితెచ్చె । మునికిచారుసింహాసనమిచ్చెనుమహాత్ । దారుఁడై పూజయొనర్చెనుకరము । లారూఢినొదలఁజేర్చెనుస్వామి । మీరువచ్చుట కేమి కా మిదిదెల్పుఁ । డీరాజ్యమైనమీ కిచ్చెదననెను రా॥ కేందు॥౧

కౌశికుఁడాపూజగైకొనిపల్కెభూ మీశమారీచ సుబాహులు మాం । సాశనులద్భుతదేహులు ఘోర । పైశాచిక ప్రేతవాహులు-కాల । పాశవిడంబితబాహులుదివి । జేశాది సురమునిద్రోహులుయజ్ఞ । నాశకులధికదుర్మోహులుగా । డాసివారలపొగరడంచసలక్ష్మణుని జేసిరామునిఁబంపు మీ శుభమానన॥ నిందు॥ ౨

భూమిీశుఁడేకాంతమున వసిష్ఠుతోఁ బల్కె నేమి సేయుదు నేఘం
దు నెట్లు । రాముని నెడఁబాసియుందును సుగుణ । ధాముని నెన్నఁడు గను
గొందును గురు । స్వామియెవ్విధి సుఖము చెందును ఈవి । శ్వామిత్రు
నుడియెటువిందును ఇతని । కేమిమనవిఁ జేసికొందు నేను । ఈమాటవి
నకున్న నిపుడే శాపమిచ్చు । నీమానియనిన గురుఁ డిట్లనియె నెను రా॥
కేం దు॥ 3

నరవరవినుమిది పరమరహస్యము నరుఁడా శ్రీరఘురాముఁడు-
ఘోర । దురితాంధకారవి రాముఁడుహరి పరమాత్ముఁడు కమలాకాముఁ
డుభక్త । వరదుఁడు ప్రణతసుత్రాముఁడుదిన । కరవంశ జలనిధిసోముఁ
డు మాని । వరదేవతా సార్వభౌముఁడు ఇతఁడు । పరమేష్ఠి చేతోల్లి
ప్రార్థితుఁడయిభూమి । భారముమాన్పనీవరతనయుఁడాయన నె॥ విందు॥

రాజానీవుకశ్యపబ్రహ్మవుకౌసల్య జేజేల కెల్ల నుతల్లి అదితి । నాఁ
జనుతరుణీమతల్లి మీరు । శ్రీజానిభజయించితోల్లి చాలాపూజింపనతఁ
డుల్లసిల్లి సుతుఁడ । నై జనించెదమీకు నెల్లిననియ వ్యాజకరుణారసముఁ
జల్లి నేఁడు । రాజీవాక్షుఁడు రాముఁడై చూపట్టె శేషుఁ డేసుమీలక్ష్మ
ణుఁడిదినిజమ నెను రా॥ కేందు॥ ४

వర శంఖచక్రముల్ భరతశత్రుఘ్నులై రరుదార హరి యాజ్ఞ
చేతసురు । చిరయోగమాయయె సీత యనఁగ మెరసి జనకవంశజాత
యై । పరఁగుచున్నది ధీసమేతవినుత సరససద్గుణమణివ్రాతయిది । ప
రమగోప్యములక్ష్మణుని రాముని మాని వరు వెంటబంపుమని పల్కె వసిష్ఠు॥
డిందు॥ ౬

రామలక్ష్మణులను రాజుపిలువఁబంచి ప్రేమతోఁ గౌఁగిటనుంచె
ను తన మ । హామహులనుతియించెను తన దే మహాభాగ్యమనియెం
చెను వి । శ్వామిత్రుఁజాలపూజించెను ఘన శ్యాముసినతనికర్పించెను-

శుభ । మామీకనిదీవించెను శ్రీ రాములంతటధను ర్బాణతూణీరధరు లైమించిమునివెంట నతిమోదమునజని॥ రిందు॥ ౭

లలినిబలాతిబలలను రెండువిద్యలు రామునకు మానియిచ్చెను- రాముఁ । డలరిగంగానదినిమెచ్చెను ఆ । వలఁబోవ దాటకవచ్చెను దా ని ! బొలియింప మునిసెలవిచ్చెను ఒక్క । ములికియురమ్మునగ్రుచ్చెను దనుజ విలవిలతన్నుకచచ్చెను ఆ । వెలదయాబిడరూపు విడియతుసతి యై చెలఁగిరామునిఁబొగడి శ్రీమిూఅఁజనెను రా॥ కేందు॥ ౮

కౌఁగిటరామునిగదియించిజడదారి వేగమె శిరముముద్దాడెను- అంత । బాగాయెనని కొనియాడెను మహా యోగిధ్యేయుఁడవనుచు వేఁడెను హర్ష । సాగరమునలోలలాడెను మహా భాగుఁడుముదమున గూడెను వీత ! రాగుఁడై భయమెల్లవీడెనునిగ మాగమమంత్రరహా స్యములనుదెల్పె నీగతిశేషగిరీశుఁడౌ హరికిరా॥ కేందు॥ ౯

౧౩. సౌరాష్ట్రం - ఆదితాళము.

పల్లవి. వినవే సుగుణాన్వితా గిరిరాజ సుతా॥

అనుపల్లవి-మునియుతులైరా - ములుదామాశ్రమ।

మునసునాఁడునిలిచి వేఁకువ -
ఘునులుసిద్ధాశ్రమగతులైరచ్చట ।
మునులారాఘవు - లనుబూజించిరి॥ వినవె॥

చరణములు-శ్రీరఘురామునిచేననుజ్ఞఁగొని సారయశుఁడు వి శ్వామిత్రుఁడుక్రతు । వారంభించెమహాజనవృతుఁడై సారెకుమారీచ సుబాహులస్ఫ । ధ్గారలుగురిసిరహాధీరుఁడు దాశరథిమహోద్ధతుఁడై । మారీచుననిల మార్గణమున । వారిధిలోఁబడవైచి సుబాహువి । దారి తుఁజేసెను దహనాస్త్రమునను॥ వినవె॥ ౧

సునిశితబాణములను సౌమిత్రిత దనుచరులనుజంపెను బువ్వులజ డి । యెనసి సురలుగురియించిరిసంభ్రమ మునను గుశిక సుతుఁ డినకుల తిలకుని తనతోడనిడికొని నెనరునఁ గౌగిటనునిచిలక్ష్మణుని మునుమి డి కొనియాడిఫలములు । అనఘులకునుభో జనములొనర్చెను । దిన ములుమూఁడిటు జనెను సరసముగ॥ విన॥ ౨

మునిపతి శ్రీరామునితోఁ బలికెను జనకుని యాగముగనుఁగొ నఁజనియెద । ననువుగమీరువ చ్చినశుభమానన నతుఁడగుచునను జని గూడితపో । ధనువెంటముదముతోఁ జనిచనియెదుటను వనమొకటిఫల సుమస్తరు లతాలంకృతమై జనవిరహితమై కనుపట్టఁగఁదానీ వనమేమ నరా మునితోమునిపల్కె॥ వినవె॥ 3

గౌతముఁడనుముని గలఁడులోకవి ఖ్యాతుఁడాతనికహల్యయనుసతివిధా తయొసఁగెనా దంపతులిచ్చట బ్రీతినుండనిం ద్రుఁడునొకనాఁడా । గౌ తమవేషమున నాతినెనసిచను నాతఁరిస్నాతుఁడై గౌతమమునివచ్చిభ స్మీ । భూతుఁజేతునాతో బొంకకుమనఁబురు హూతుఁడదుర్మతిఁ నైతి గావుమనెను॥ వినవె॥ ౪

శాపమొసంగెను సహస్రభగుఁడ వైపొమ్మనివృ త్రారినహా ల్యను కోపమునశిలా రూపముగమ్మనె నేవఅజంతురహితముగఁజేసె ను । యీవనినావహాని బాపు రేయెన్నడు నీపైరఘుపతి శ్రీపాదము పె ట్టునాఁటికి । శాపము చెడునని జనెసతీమణికి పాపముఁబాపవె పరమ పురుషాయనెను॥ వినవె॥ ౫

రామునికరముక రమ్మునఁబట్టిమ హాముని యప్పుడ హల్యను జూపిన భామపైనిదన । పాదమునుంచి మహామతియగు న హల్యతిన రఁగనీ రాముఁడు తామొ్రక్కె రామాయణియును లక్ష్మణునిధను ర్బా ణధరునికన కాంబరుని । శ్రీమన్మందస్మిత వదనుని శ్రీరాముని శేషాద్రి- ధాముని జూచెను॥ వినవె॥ ౬

## ౧౩. బిలహరి - ఆటతాళము.

పల్లవి—శరణుశరణనిరామ చంద్రునియహల్య సన్నుతించెనువినవే॥

అనుపల్లవి-పరమపురుషుండనుచుగౌతమవాక్య
సరణిమదిలోనెన్నుచుశౌరికిమ్రొక్కి-
యరుదారనర్ఘ్యపాద్యములిచ్చినర్మవి
స్ఫురితాక్షియైమించి - పులికించిసీ
చరణనీరజపరాగముననుదురితమెల్లఁదొలగెనహాహా
గరిమతోనుగృతార్థనైతిజ గత్ప్రభోకమలావిభోహరి॥

చరణములు-యేవిభుపాదరాజీవరేణువులచేఁ బావనమైనది భాగీరధీమహా। దేవిబ్రహ్మాదిసురావళినేమహాను భావుఁడు గావించె నేవరదుపదరజము। వేవేలవిధముల వెదుకఁబఃనుక్రతుల చేవనజభవుఁడెవని శ్రీనాభిపద్మమం। ధావిర్భవించె నవ్యయుఁడైనపురవైరి। యేవిశ్వ గురునామ మేప్రొద్దుభజియించు నేవీరవరుపాద మీభువనజాలములనెల్ల నాక్రమించెను। శ్రీవనితామణికి నెవ్వానియురము చెలఁగివిహరింపనునికిపట్టయ్యెనే। దేవునిపదమనిందితరాజయోగి హృద్ధ్యేయమైతనరారిచెలువుమీఱు। నావిభుం డావరదుఁడాగురుఁడాపరుఁడాదేవుఁడిదెనను। బ్రోవుటకు ప్రత్యక్ష మయ్యెన హో విచిత్రమటంచు నెంచుచు॥ శరణ॥ ౧

శ్రీరఘువీరనీలీల లత్యద్భుతము పరికితరముగాదివి తెలియమర్త్యావ। తారమునను జగత్త్రయము మాయామోహ। పారవశ్యమునొందభ్రమియించితిని నిర్వి। కారుఁడనీవుచలనా రహితుఁడవు వికారచలనాదులు గలవారివలెనుండు। దారయపూర్ణుఁడ వానందమయుండవ కూర్రుఁడవతిమాయి। కుఁడవ్రసం విస్మయోదార విశుద్ధమాత్మ ప్రజ్ఞాఖండబోధస్వరూపుఁడవజుఁడవు। పారమార్థికుఁడవీవే భూతములకాధారభూతమునీవే యీజగమునివే। సారెకుజగదాశ్రయుడవీవె కర్తృకా

రణకార్యము లుసీవిలాసములు । చేరి కన్గొనంగ నేరకతనుధారి వందు రుగానినిన్ను । దారితాఖిలకలుష మగుపర తత్వమనఖులుల చేనగునా॥

జలజలోచననీవలఘు మాయాగుణములచే బింబితుండవై । విల సిల్లి జగదుదయ ప్రలయములకు బ్రహ్మవిష్ణ్వీశ్వరనామ । ములంబూని యున్నావు తెలియంగనొకండవె । వలనుమీఱంగాను వాచ్యవాచ్యక భే దరహితము జగన్మయుండవై । యలరుచుందువునీవ । సఖలిత తేజుండ వోంకార వాచ్యుండవు వాక్కులకగోచరుండ । వుగూఢవర్తనుండవు । భళిభళిశ్రీరామ భద్రగుణోన్నిద్ర ప్రధనాంగణరుద్ర । కలితకౌస్తుభభర శ్రీశేషా । చలశిఖరవిహార విహారమోహనాకార చెలినినెనరుంచవలె నుని । శ్చలమార్గజ్ఞానమార్గము దెలియనెంతటి దానసిదానను కలుగం జేయుమునాకు నీపదనలినభక్తినిరంతరమ్ముగం । జెలంగివందన శతము లొనరించెదను దాశరథీదయానిధి॥ శరణ॥ 3

౧౪. బేగడ - ఆదితాళము.

పల్లవి-వినీల వేశివినుతగుణశ్రీశి విన వేశర్వాణి॥

అనుపల్లవి-ఘనఘనాంగుండౌ రాముని చేననుజ్ఞంగొని॥

గౌతమమునిమొద్దికి జనెనహల్య
మునీంద్రుం డారాఘవునిం జూచివలెకె
ఘనంబుగను మిథిలాపురంబునను
ఘనధర్మముమా హేశ్వరచాపము
కనుంగొనియనంతరంబయోధ్యకుం
జనేవనర విసముద్రిం డయ్యెనుహారి॥ వినీల॥

చరణములు-రంగదభంగతరంగగంగ నుప్పొంగుచుదాంటివిదే హరాజపురి । చెంగటరాగనెఱింగిజనకుండు చెలంగుచునెదురుగను । రం గుగననిగాధేయునకును సాష్టాంగమొఱఁగి పూజించిదిశలువెలు । గంగం జేయుచంద్రసూర్యులో సురపుంగవులగు నరనారాయణులో । శృంగా

రకళలను బంగారుతళుకుల । సంగానుదగిశవీర లెవ్వరె । ఉంగవలయు సనదశరథాత్మజులు । మంగళకరులీరామలక్ష్మణులు మహాభుజుల్ ఘనులనిముని తెల్పెను॥ వినీల॥ ౧

శివిగమత్క్రతుసంరక్షణమున కై వీరలనేఁదోడి తెచ్చునెడ । పావనుఁడీరాఘవుఁ డొకశరమునఁ జావనేసెఁదాటకను । భూవరమదీయ యాగవిఘాతకులై వరలుసుబాహు ప్రముఖనిశిచ । రావళిద్రుంచియు మారీచుజలధిలో వైచెఁ బదాంబుజరజమునను । ఈవీరుఁడహల్యను వేవేగబవిత్రినను । గావించి నేఁడుసీగృహంబున గరళకంఠువిల్లనుఁగొనవచ్చెను । నావుడునగరికిఁదోడ్కొని జనియానరేంద్రుఁ డారామునిఁబూజించెను॥ వినీల॥ ౨

అంతటజనకుఁడుమంత్రులఁ బిలిచిపురాంతకు విలుదెమ్మనిన భటుల న । త్యంతబలులనైదు వేలబంపినఁ బంతము మీఱఁజని । సంతతమును మణి శస్త్రాదులచే నెంతయు భూషితమైరవిశత । కాంతమైనవిలుదెచ్చినధరణీ కాంతుఁడు కౌశికుఁగనుగొనియా । వింతౌనృపవరులంత చూడఁగ । సంతోషమునరఘూద్వహుండీ చాపమెక్కిడినఁజాలునుసీతా । కాంతనిత్తునన విని శ్రీరాముని కనుంగొనెన్మునిదరహాసమునను॥ వినీల॥ 3

శ్రీరాముఁడువామకరంబున విల్లారూఢిగఁగొని యెక్కిడి నృపతులు । చేరిచూడదక్షిణకరముననరుదారగిలించినపుడె । సారము చెడి ఫెళ ఫెళమనివిరిగెనువైరివరుల యధైర్యముతోఁగూడద । దారవముదిశల్నిండెవిమానారూఢులగుచుఁగనుగొనుదేవత । లారాముని శ్రీమీఱఁ బొగడిరి । తోరంబుగాబ్రసూన రవము దుందుభిధ్వానుల్సురవనితాఘన । చారునాట్యములు చెలఁగరాఘవుని జనేశుఁడక్కిలిఁగౌఁగిటనుంచెను॥ వినీల॥ ౪

ఫుల్లాంబుజపత్రాక్షుఁడు రాముఁడు - విల్లు విఱచుటలు విని
యంతఃపుర । పల్లవాధరలుమనసీతకుశ్రీవల్లభుఁడనదగిన । వల్లభుఁడిదె
వచ్చెనుచల్లనివాఁ డెల్లజగములను నేలఁజాలువాఁ । డల్లమరునైనఁజ
క్కదనమున నుల్లసంబులాడునటెయంచుఁ । జెల్లారాముని నల్లాకోరిక ।
లెల్లాఫలించువంశపావనుఁ డీమహాత్ముఁడంచనిపలికినసరస । సల్లాపము
లాడుసీతకుమణిసఖుల్వీరుల్ హారుప్రగం గైచేసిరి॥ విసీల॥ ౫

పట్టుచీరఁగట్టిఁగట్టిరవికెచను కట్టుదిట్టముగఁగట్టి మృగమదము ।
బొట్టునుదుటనునిచి కనుల కాటుక బెట్టికురులుదువ్వి । దట్టముగాఁగీలు
ముడివైచిమల్లె మట్టుమీరవేడుకచేసరములు । జుట్టిస్వర్ణభూషణము
లు మేనను దట్టముగా బూటమొక్క చెలికత్తె । బట్టిజనకునిపట్టి శౌరి
కి పట్టంపురాణినౌదు నేనని వాసింఁడఁగుందనపుబొమ్మవలె । నెట్టన
రాజమరాళకరిగతుల నే తానిరాకరింపుచునందెలు॥ విసీల॥ ౬

తాటంకద్యుతిదిక్కులనెల్లను దీటుకొనఁగఁ బాఁపటబొట్టునుసరి।
సాటిలేనిచంద్రసూర్యులును సల్లలాటమునను మెఱయ । తేటముత్యపు
సరులు పతకములు మేటిపలుక తాళిఁడఁ బెనగొన । మాటికినందె
లుఘల్లనిమ్రోయఁగ దీటులేని వైఖరి సీతావ । ఘాటి గుణముల పేటి
హారకి । రీటాది భూషణాదులశేషగి రీశురామభూవిభునిచేరిమణి । హా
టకమయమాలికగళమునవిడి హారిక్షవరించితిననిచనెనుదమున॥ విసీల॥

౧౩. కాఫీ - జంపెతాళము.

పల్లవి-వినుహైమవతి ఘనాఘన సుందరాకృతీ వినుతసన్మతీకరు
ణావతీ॥

అనుపల్లవి-తనమంత్రులనుబనిచె దశరథునితోడి తెమ్మని జనకనృపతి
వేగా బాగా॥ విను॥

చరణములు-ఆరూఢిదివసత్రయమునవార లయోధ్యఁజేరిదశ
రథునిగాంచి ధీరులయిమ్రొక్కిబహుదివ్యవస్తువుల నరు దారఁగాన్క

యుంచి। శ్రీరామునకుజయ శ్రీరమారామునకు సీతనునిశ్చయించి నేఁడు శ్రీమిాఅమిముబిలువనం పెనుజనకుఁ డనసంభ్రమించి వేఁడుకదలం చిమించి॥ విను॥ ౧

జనవిభుఁడుశ్రీరామ చంద్రునకుఁగల్యాణ మనిచాటనానతిచ్చి। జనకమంత్రులకును త్సాహానవరత్నభూషణదుకూలములనిచ్చి। తనగురుండునగువసిష్ఠునిసుమంత్రునిగనిరా ముని పెండ్లివార్త దెచ్చితగుఁగదా జనకవిభుబాంధవ్య మనినకడు లెస్సయనియనువుగా ముదముహెచ్చి। మెచ్చి॥ విను॥ ౨

మఱునాఁడుగురుహితస మస్తజనులెల్ల వేమఱు బలసికొలువగాను। అరుదయినయాఁశె ము త్యములగొడుగులనిడ నధికవై భవముతోను।భరతశతృఘ్నులిరు పురుగజాహుషులై యిరుగడలఁజేరిరాను రథమెక్కి। నరవరుఁడుమిథిలాన గరమునకుఁజనెనెలమి నాల్గుదినములలోను తాను॥ విను॥ 3

హితమతిసీదశరథున కెదురుగాఁజనిపురోహిత సహితుఁడై జనకుఁడు। చతురుఁడయిపూజింప సరసులయిరామ లక్ష్మణులుతమతండ్రికపుడు। అతిభక్తిప్రణమిల్ల నాలింగనమొనర్చె నానందముననునృపుఁడు తతమహో। న్నతజనకరాజసద నమునసుతకౌశికాన్వితుఁడై వసించె నతఁడుజనహితుఁడు॥ విను॥ ౪

తనయాగకర్మమం తయుదీర్చిజనకుండుశ తానందుతోడననెను। దనరుకాస్యపుర మునను నను జుఁడు కుశ ధ్వజుడుండుమోదముననను। మొనపిలువనంపు మనవినియట్లుసేయ జయ్యనవచ్చియతఁ డన్నను పొడఁగాంచిత। నకుమారికలు తానును మ్రొక్కివర్ధిల్లు మనుచుదీవెనలుగొనెనుమనెను॥ విను॥ ౫

లలినిజనకుఁడుపురమ లంకరింపుమనఁదోరణ చయోల్లాసితంబు। అలఘుసౌధధ్వజో జ్జ్వలముగోపురపతా నావళీరాజితంబు। ఫలభార

నమర్రి రంభా స్తంభశోభిత ప్రతిగృహ ప్రాంగణంబు కర్పూర । కలి
తాంబు పూరగంధిలరాజమార్గమును సై చేసిరాపురంబు డంబు॥విను॥
క్రమముతోనంతః పురమలంకరించిబం గారుకుంభములనుంచి।
సమమైనపచ్చ రా జగతిపైనిలిపి నీ లములబోదెలుఘటించి। రమణీయ
ముగనుబగ డములదూలముల వనములగోణిగెలురచించి చతుర్ద్వార
ములగోమరొప్పఁ గల్యాణవేదికగట్టి రమరికనుసంతసించి మేలెంచి॥
విను॥ ౭

ఎలమిసీతాదికాంతలకు నలుఁగులఁబెట్టి తలలంటిజలకమార్చి।
జిలుగులనుదడియొత్తి చెలఁగిసరిగంచుచీ రలుగట్టికురులఁగూర్చి। వలనొ
ప్పగొప్పకొ ప్పులఁబెట్టిచందనం బలదితిలకములుదీర్చి। రవికలనుపొర
యచను కట్లపైనల వఱచకై సేయనలరిరసముగజేర్చి మదిచేర్చి॥ విను॥
పరఁగకేకయపతికుమారుఁడు యుధాజిత్తు వచ్చెనచ్చటికినంతవ
రుసదశరథుండున ల్వురుసుతులభూషణా వళులఁగయిచేసిచెంత। సిరుల
నందఁదానుండు తఱిజనకుఁడానంద భరితుఁడయిభద్రదంతావళములను।
గరిమవఁ నబనుపరా ఘుపులెక్కిరాజమార్గమునఁజూపట్టిరెంత వింత॥
విను॥ ౯

పొదలుచునుగౌసల్య మొదలౌసతులుగొల్వ భూపతులుచేరికొ
లువ। విదితమాగధవంది బృందములుగొలువనట విటగాయకులును
గొలువసదయులువసిష్ఠ విశ్వామిత్రులాశీర్వ చనములొసఁగుచునుగొ
లువ కల్యాణసదనమునకరిగె శేషగిరీశుఁడగురామ చంద్రుడెందమును
దము మొలవ చెలువ॥ విను॥ ౧౦

౧౬. కల్యాణి - అటతాళము.

పల్లవి-కల్యాణమువినవే నేడుసీతా కల్యాణమువినవే॥
అనుపల్లవి-కల్యాణమయమయిన కల్యాణనిలయమున
కల్యాణప్రదుఁడాయ హల్యావరదుని॥ కల్యా॥

చరణములు- వేదనాదములు వేణుధవళవీ ణాదుందుభి డిండిమా
దిమహావాద్య । నాదములు - పుణ్యాంగ నాబృంద శుభగాన । నాద
ములుఁ జెలఁగ జనకుఁ-డెదుర్కొని దశర । థాదిభూపతుల కర్హాసన
మునిచి యీ । మీఁదసపురోహితుఁడై దేవముఖ హోమ । వేదిఁబ్రతి
ష్ఠించి వివిధమంత్రములచే । వేదోక్తహోమవిధులొనరించి సీతాది
కన్యలధన్యలనల్వురనుస । మ్ముదమునరావించి మురియుచుశుభజాలా।
పాదకముగమధు పర్కమిచ్చి వేడ్కఁ । బ్రోదిచేసినృపుఁడుపూజించెరా
ముల॥ కల్యా॥ ౧

శ్రీమీఱజనకుఁడు శృంగారవతియై సా । దామినీలతమాడ్కిం
దనరెడుసీతా । కోమలి తెఱ మఱుఁగున నుంచి చాలఁగా । రామునిరా
మాభిరాముఁడైన శ్రీ।రామచంద్రునిపాద రాజీవములుగడిగి । సేమ
మునతజ్జలము శిరమునధరించి । నేమముతోసీత నిఖిలలోకమాత । గా
మితసిద్ధసంకల్పపూర్వకము । భూమీశుఁడుధార బోయనగ్నిసాక్షి।గా
మానవతినిరాఘవుఁడు చేకొనె దేవ । తామందార సుమ ధారలుగు
రిసె భ।ద్రామితగుణులయి యలరువధూవరులపై॥ క॥ ౨

అంతఁదెరఁదీయ సతివమోముఁజూచి సంతసించెను రామచం
ద్రుకన్గవతారాకాంతుఁగనుంగొనియలరుకలువల పోల్కె నాయింతిచూ
పులుదనరె హృదయేశుపదయుగళి నెంతయుదామరల నెనయు తేఁటు
లనఁగా । కాంతామణినిపాణి గ్రహణమొనరఁజేసి । కంతుజనకుఁడు
మంగళసూత్రముగట్టి । దంతిగమనకుమణులు తలఁబ్రాలుపోసి శ్రీ ।
మంతుఁడై లాజహోమముఁ జేసికృత్యస్వాంతుఁ డ।య్యెను తాటకాం
తకుఁడటమీఁద । సంతితానందమున జనకుఁడూర్మిళనిచ్చె।మంతుకెక్క
గాను లక్ష్మణకుమారునకు॥ కల్యా॥ 3

వరుసతోడనుకుశ ధ్వజునికొమార్తెల।సురుచిరమాండవిశ్రుతకీర్తు
లనిరువురనుభరతశ త్రుఘ్నులకునుజనక।ధరణీశుఁడానంద భరితుఁడగు

చు నొసఁగె । వరుదారఁగాఁ బెండ్లి యలరా రెనా వేళఁ । జిరతరయశులు
వసిష్ఠ విశ్వామిత్రు । లురువునవాషధూవరులకు శేషలు । శిరమునని
డిరియా శీర్వాదములఁ జేసి । రిరువందదశ కథా ధీశుఁడుదీవించె। గరిమను
గౌసల్య సుమిత్రాది । కరిగమనలుమం గళహారతులొసఁగి రాతతశిరా
మలక్ష్మణ భరతశత్రుఘ్నులకు॥ కల్యా॥ ౪

జనకవిభుఁడు కౌశి కునివశిష్ఠుఁగనుఁ । గొనిపల్కె నారద ముని
యుచటికి నొక నాఁడు । చను దెంచిననువిను మనిపలికె హరిభక్త । జనవ
రదుఁడయి నిర్జరులనుబ్రోవ రా । వణువధియింప రఘువంశమునను రా
ముఁ । డను పేర దాశరథియై నాలుగంశముల । జననమొందెను సీత
యను నామమున నీయిం । టను యోగమాయ బుట్టెను దెలిసికౌసల్య ।
తనయునకు సీతనిమ్మని చనెనది మొదలు । గను సీతశ్రీసతి యనితలఁచి
యేవిధ । మున రాముఁడల్లుఁడౌ నని చింతించిధను । వను నెపమునమీాద
యను శుభముగంటిననె॥ కల్యా॥ ౫

శ్రీరామచంద్రుని జేరి జనకుఁడు బలికె। శౌరి నా జన్మము సాఫల్య
మాయెను । దారయీ పావనస్థలిని సీతాయుతుఁడవై । రంజిలు నిన్నుఁ।
జూడనర్హుండనైతి । రావణరణభువి నిర్మాణనై పుశికలిగె । నీరజభవు
నకు నీ పాదవారిచే।నీరమ్య పదజలము నెటిదాల్చిబలిమహా । వీరుఁడ
యిసురరాజ్య విభవము చేకొనె। సారగమానీపాద రజముననహల్య। ఘో
రశాపము దొలఁగె కోవిదులునుసీయుదా రాంఘ్రిరేణువులు। కోరినభ
యదూరులైనట్టినీ వేశరణని పొగడెరాముని॥ కల్యా॥ ౬

సారిదియాసమమున సురదుందుభులు మ్రోసె। ధిక్కృతద్దిస్సాం
కితక తాథైథైయ్యనుచున । చ్ఛరలాడిరిగంధర్వ వరులు బాడిరిభూ। సుర
వరులధరణి వరులఁబూజచేసి సరసమృష్టాన్న భోజనములిడిరీ। కరణీప
రగనాల్గునాళ్లు జరుగుటయు గౌశికుఁ । డరిగెనల్లుండ్రకు సరుణమిచ్చి
నృపుఁడు । కర్ణుణాఫేంబుత్రికల ఘునమృత్తుల్లఁగావించి । త్వరతోడఁ బన్ను

వనా దశరథక్షితిపతి । వరసుతులుఁగోడండ్రు సిరులలరనా శేష।గిరిహా సుఁడైనరఘు వరుని మున్నిడుకొని । పురికిప్రయాణోన్ముఖుఁడయ్యెము దమున॥ కల్యా॥ ౮

## ౧౮. సురటి - ఆదితాళము.

పల్లవి-చేరివినవె శౌరిచరితము గౌరీసుకుమారగిరివరకుమారీ॥

అనుపల్లవి-వారిజాక్షుఁడంతటను శ్రీ మిాటివేడ్కతోఁ నయోధ్యకు
గోరిపోవుదారిలో నృపవైరియైనపరశురాముఁడు
కాఱుమొగులుకరణి చాపధరుఁడై
కాలమృత్యువో యనగఁబత్తిరథు
కోరిహరియెదుటను నిలిచిపలికెను
వీరాధివీరుఁడని యెఱుఁగక॥ చేరి॥

చరణములు- బెండువంటివిల్లునడిమికి రెండు జేసి యిట్లుప్పొంగ దు।కొండనెనయఁజెల్లు నా విలు దండివైరులకుముల్లుకడు । గండుమిగిలిన దీనినెక్కుఁబెట్టినఁ గానిరాముఁడవనినునట్టుగా । కుండినఁజంపుదు ననరాముఁడతనికో దండముగొంత చక్కనెక్కిడియ । ఖండాశుగము తగఁదొడిగి తెగ నిండాదిగొనిభార్గవుఁడ నిను । కాండహతచరణుఁజేసి నృప కాండాభిరాముఁడనౌదుననినఁ । బుండరీకలోచనుండితండని పూర్వకాలసంస్మృతి పొడమిపొగడి । భండనప్రచండ పండితుండవ జాండాధిపతి వవ్యయుఁడవనెను॥ చేరి॥ ౧

బాల్యమునను నేను ఘోరతపంబు సేయఁబోను హరివాత్సల్యమొప్పగాను వేగప్రసన్నుడై పలికెఁ దాను సా । ఫల్యమయ్యెనీతపమునుజనస్మృతమునువచ్చి వంశయుతుఁడ వగుసా । ఫల్యబలుడవగుచుబిత్రుహననుఁడగు కార్తవీర్యుఁగెలిచిఖిలనృపులవై । కల్యాత్మకుల జంపిశమదమ మూలార్థితుఁడవగుము నేగా । సల్యాగర్భమున రాముడవఁ గల్యాణదాయినై జనించియ । హల్యాసతిబవిత్రంజేసిసీతను గల్యా

ణమైనీకు దర్శనము । తుల్యముగనెసఁగుదుననిజనియె దయతోనాహరి
య నీవనిచనియె॥ చేరి॥ ౨

స్వామినేనుమంచి హేహాయ వంశజులను దుంచి శాంతుఁడై
ముదముదలంచి చెలఁగెడు నీమహా మహిమనుంచి ఖగ । గామినీబలం
బునీవుగొంటివి గాన నేనుధన్యతముఁడునైచిన । నీమహనీయ దర్శనము
గలిగెంజుం తామహాఘుల కగోచరుఁడవు శ్రీ । రామామనోహరుఁడవ
గురఘు రామా ప్రకృతికంటెపరుఁడవు । కామాద్యరివర్గదూరుఁడవ
హేమామాధవ భవరహితుఁడవు । కామకర్తగుణవర్జితుఁడవునుద క
మున ఫేనజాలములుననలమున । ధూమమటులనటులనె యఖిలమును
నీమాయచేఁగల్పితంబనె॥ చేరి॥ 3

ఎంతదాఁకనరుఁడునీపద హితులపొత్తుబొరఁడునినువా । డంత
దాఁకనరుఁడు । వలెనుభవాబ్ధినరుగుపామరుఁడు ఏ । కాంతుండయిసు
జనసంగతివలనను గనినభక్తిచేతనెపుడునిన్ను న । నంతునాశ్రయించి
నపుడుమాయకు నంతముపేక్షితుండును స్వప్రకాశుఁడును । శాంతా
త్మకుఁడునై నసద్గురుఁ డంతవానికగుపడును సుని । తాంతానందమతని
చేతగని చింతలవంతలనెల్లఁ ద్రుంచిని । రంతరాత్మసుఖముఁ జెందునీప
ద రాజీవ యుగభక్తి లేనినరు । లంతమొందిజ్ఞానముక్తి సుఖముల నం
దవశముగాక చెడుదురనె॥ చేరి॥ ४

ఈశశరణుశరణు దురితవి నాశశరణుశరణు సుజన । క్లేశహర
ణశరణుజయజయ శ్రీరామశరణుశరణు నేఁజేసినట్టి పుణ్యమెల్లనీదుమ
హాశుగమున కొసంగినాడఁ ననుదయ । జేసిబ్రోవుమనఁ బరశురాము
నకు సీతావిభుండుప్రసన్నుండైపలికె । వాసినీమనంబుననుదల పోసి
వరముగోరునుకృప । జేసినాననిన భృగుకులుండు భాసిల్లుచు నీదుపద
రజో లేశమునకు నేసమతవరమఖి లేశభక్తినిమ్మనగృతార్థునిగఁ । జేసి
యనుపం జనియెజామదగ్ని ని జేచ్ఛఁదనుజరిపునుతించుచుఁజనె॥ చేరి॥ గి

ప్రీతుండయ్యెఁజాలాదశరథవిభుడంతటలీలా గుణముల । చేతనలరిచాలా తగపురిఁజేరి చక్రియావేళ భూ । జాతనెనసితనరెనను జులు నిజ సతులరతులనే విరతులవిభవస । మేతుండు జగత్ప్రభుండుబ్రథిత గుణ జాతుండవ్యయానందమూర్తిఁ సం । గీతానంతకీర్తితసుగుణ భూతాద్యఖిలసాక్షిమాయా । జాతాఖిల కలుషహారుండుసాకేతాధిపుడై యుండెహరిద । యాతిశయత నిదియుంజెప్పె సుబ్రహ్మణ్యకవి శేషగిరీశుపేరవి । ఖ్యాతిమీఱనధ్యాత్మరామాయ ణాఖ్యానమున బాలకాండమేది॥ చేరి॥ ౬

శ్రీమదధ్యాత్మరామాయణకీర్తనలు

బాలకాండము సంపూర్ణము.





శ్రీవేఙ్కటేశాయనమః

# శ్రీమదధ్యాత్మరామాయణ కీర్తనలు.

## అ యో ధ్యా కాం డ ము.

### ౧౮. కర్ణాటకసారంగ - ఆటతాళము.

పల్లవి- శ్రీసద్గుణాన్వితా శీతాద్రిసుతవినవె కౌశేయ।
వాసుని శేషాచల వాసుని చరిత్రము॥

అనుపల్లవి- భాసిల్లునంతఃపురవరమునందు మణిసిం। హాసనస్థితుఁడైము
నినుతుఁడై మహోల్లాసుఁడై శ్రీనివాసుఁడై శ్రితదాసుఁడ
యిసీతాసహితుఁడగు రామునిఁగను తలఁపూనిసురమౌని
వచ్చెను॥

చరణములు- శరదిందుచంద్రికా సదృశమౌతనుద్యుతుల। మెఱయుచువచ్చువాని నారదుఁగా। నెఱిగి సీతాజానియుదేవీయుతుఁడయి। పౌర పౌరయింతలేనిభక్తిచేమ్రొక్కి। పరఁగఁబూజించిమౌని నీదరినసం। స్మరణాచేవిషయాసక్త చిత్తులమైనసం। సారచింతమాటికి గలుగుమముఁబోటికి। దొరకదిదిదుర్లభమునినుగనిపరమపావనుఁడనైతినిభా। స్కరుఁడురాఁదమమడఁగు క్రియనజ్ఞానమడఁగు ననమునిపల్కెను॥ శ్రీస॥ ౧

శ్రీరామభద్రమయఁ జేసెదవోననులోకానుసారవాక్యములచేను సం। సారినటిదియరయసత్యమేను జగదాదియామా। యారమణి గృహిణిగాను జేయుటనునీసుతు। లయిరిబ్రహ్మాదులెల్లనుత్రిజగన్మహా

సం। సారిపీవుహరిజనకలక్ష్మి మపురవై రిపీవుప్రభజానకి । యాదూఢిస్త్రీ పురుషవాచ్యములన్ని సీతయుసీవయనియెను॥ శ్రీస॥ 3

స్వామినీఛాయ యవ్యాకృతమనఁబడునది । యేమూలప్రకృతినాఁగ మహత్తత్వ । మామహత్తత్వాన లింగశరీర । మైమటియది సకలమైన తనువులఁజేసెన । హంకారబుద్ధిప్రాణజ్ఞానకర్ణేంద్రియ । సముదాయకములింగ శరీరమనఁబడునదై । జన్మకర్మమూలము ఇంద్రజాలము ఆమహాత్మయెజీవసంజ్ఞ ననాద్యవిద్యో । పాధినొందినదై మించె స్థూలాదిదేహత్రియమెజీవోపాధియనియును॥ శ్రీస॥ ౪

స్థూలసూక్ష్మకారణాలజాగ్రత్స్వప్న । సుప్త్యవస్థలు మూఁడు గల్గెనీసంసృతి । లీలచేనెనయువాఁడుజీవుఁడెపరమాత్మత్రి । కాలసాక్షియీరేడులోకములకాది । మూలమదినీవేమాడుమాయాభువన । జాలములునీయందె జనస్థితిలయములై జరుగుచున్నవిరామా రాక్షసవిరామా । వ్యాళమనితాడ్రుగని బెదరిన పోలికనుదనుఁ జీవుఁడనుకొను। బాలుఁడుఘనుఁడాత్మతానని భయరహితుఁడయి యలరుననియెను॥ శ్రీ॥ గి

ఏనీతేజమున నీయఖిలములు వెలుఁగునిదిపుణ్యశ్లోక యెందాక న । జ్ఞానము తెగిపోకయుండునందాఁక దీనుఁడగుజనుఁడు నీకారుణ్యము నవి । జ్ఞానానంద ముదవిన నములుఁడౌనదినీపా । దారవిందభక్తినిగలిగె దేవముక్తిని । దానమగురామ నీదాసుల దాసుఁడనుకరుణనుబ్రోవుము । నీనాభి కమలజుఁడు మాతండ్రియటుగాననేబాతుర్డనసె॥ శ్రీ॥౬

అనిచాలాప్రణతుఁడై యానందబాష్పములు । కనులజడిగొనజడదారి రఘువంశతిలకుని । వినుతించిపలికెఁజేరి రావణవధార్థము । జనియించినాపుశౌరి దశరథుఁడునిన్ను । దనవిభునిఁజేయఁగోరి యున్నాడటుల । యినరావణుఁడు చచ్చునిటులతనిఁజంపుదు ననిప్రతిజ్ఞఁజేసినావుమునుడాసి । వినుముభూభారహరణమునకు మొనయు మిదివనజభ

ఫువాక్యము । లనినఁ జిఱునగవు మొగమునఁజిగి పెనఁగొనఁగ నఁనియె
శ్రీరాముఁడు॥ శ్రీస॥ ౭

వినునారద నేనెఱుఁ గనిదేమియును లేదు । మునుప్రితిన నాచేత
నటుచేయఁబడెనటు । లనేఁజేతు సకలభూతముల సుఖాసుఖములు । ఘ
నకాలసంజాతములు ప్రారబ్ధ । ములగునవి భువననే తన్నై తగులక నేనే
యొనసివినోదితునిది రేపుదండకాటవికేగి । మునివేషముదాల్చి సం
తోషమునను జతుర్దశవత్సరములందును । సీతయును నెపమునను రావ
ణునిసబలముగఁ జంపుదునని విని దేవగతిజ నెముసిందుప్రిఁకు॥ శ్రీస॥ ౮.

## ౧౯. పూరికళ్యాణి-ఆదితాళము.

పల్లవి-వినవే శుకవాణీమాణిక్య - వీణావాదనపటుపాణీ॥

అనుపల్లవి-మనువంశ్యుఁడు దశరథుఁడంతట - మంతనమునవసియించి
నవసిష్ఠుని । ఘనముగ రావించి మన్నించి వినుమనిపలికె మ
హాత్మనిఖిలజను । లునుమాంటికిఁబోగ డెదరు శ్రీరాముని - ఘ
నగుణాభిరాముని యువరాజునుగా । నొనర్పవలెనిపుడె భర
తుఁ - డనుజునిగూడిచనెను మామనుగనుఁ । గొనశుభదీక్ష
నునుపు రామునిరయమునగనె॥ వినవే॥

చరణములు-వరమౌని దశరథుని వీడ్కొని రఘువరునగిరికి వేగ
రాఁగా । శ్రీవారియెదుర్కొనిరాఁగా వసిష్ఠునిపరఁగ సత్కృతుఁగాఁగాఁ
జేసెఁసీతా । తరుణిహేమకలశోదకములొసఁగఁగ । గురినియడుగులుగ
డిగి శిరమునవార్చి । ధరియించె నేమమడిగి పూజించినీ । చరణనీర
ధారణ మునకృతార్థుఁడనై । మెఱసితిననుదా శరధిపలుకువిని చిఱు
నగవుఁదొలుకఁగఁ బలికెముని నీ । చరణజలముహరుఁడు శిరమునంది
డి పరమపురుషుఁడాయె మాతండ్రి । నలువయునీపదాంబువుల సుఖి
యయ్యెననెను॥ వినవే॥ ౧

ఇటులనందగు నేలోక గురుండవుని శ్వేశుండవనియురమాపతి వనియుసము। త్కూటయశుండవనియుంబర మాత్ముండవనియునిన్ను। కుటిలులకెఱుంగవశ మాభక్తపాలన। చటులుడవైభూభా రముమాన్ప రావణుని। జంపకమదినెంచిపుట్టితివని। దిటవుననిశ్చయించినానునే ను। అటులైనబహుగోప్యముం జేసితిని। నెటులమాయచే సర్వముంజే యుదు। వటులనేగురుండనీ వనుచునటనసల్పితి స్వామిజగ। న్నటన సూత్రధారియఖిల భూతాం। తర్యామియనన్ వెలయుదువనెను దపసి॥ విన వే॥ ౨

నీవుశుద్ధసత్వమయమైన మేను నెఱిబూనిభువియందు మాయా మనుజ। భావమునంజెలగుచుం దువకటరాజ సేవగాసి,జెం దుపౌరో హిత్య జీవనమతినిం దితమనిదెలిసియు। నీవురఘువంశమున జనియిం తువని భావించిసంతసమున నీకుగురుండనై। యేవేడుకకిదినే నియ్యా కొంటినాతప। మిప్పుడు ఫలియించెనన్నికనీనూ। యావిభూతికగప డుపకు దశరథ భూమివిభుండునిన్ను పట్టముగట్టను। భావహుంగమ్మ నెను సీతతో దీక్షావిధనుండుమని చనియెవసిష్ఠముని॥ విన వే॥ 3

శ్రీవిభుండులక్ష్మణునింగనన్ను యువరాజ్యాభిషిక్తుంజేసెదరు నే పాక్షీమాతుృండను। నీవెసకలముబూ నుకర్తవుభోక్తవు। నీవేనాప్రా ణములు మేనునిమ్మనిబలికె। నావేళ పౌరజనులురా మునియువరాజ్య। శ్రీ॥ వీనికడుపుహెచ్చిదశరధునిమెచ్చి యావార్తలపుడెదెచ్చికౌసల్యా దేవితోనుసుమిత్రా దేవితోదెలుపవార। లావాక్యాకర్ణనమునసం తోషపూర్ణు। లయివెలసిరీసురలు సరస్వతింగని। దేవినీనయోధ్యకుం జనివిన్నపము గావింపుమురామాభిషేకమునవాబుధప్రార్థనకియ్యకొ నెవాణి॥ విన వే॥ ౪

కొమరారుకైక వరదాసి యొకతె కుంటిదిగూనిది గుజ్జుమాపు ది। ఘిడిగుబ్బిడ్డముడ్డిబొమలుడ్డొంకుమైగల ది‌యయోధ్యలో నేరమున్ను

లకు నవ్వులాటదిమందరయను కుమతియొక్క తెగలకుభారతిదానిఁజెం
ది కుమరయుయుండె నంతఃపురశృంగారముల । నమరియంతయువింత
మైయున్నఁసూచి । భ్రమసిమందర తొందరతోవచ్చికైకకేపె రాము
నకుపట్టాభిషేకమనఁగానీకైక । పరిమదమొదవి బంగారందెలొసఁగ
పడఁతియొల్లకది భయసమయము సుఖ । సమయముగాదబల శేషశైల-
స్వామియైనరామునిశుభమునీకనెను॥ వినవే॥ ౨

౨౦. తోడిరాగము - అటతాళము.

పల్లవి-సరసగుణముఃశేసన్మందిర - షఖీకృతేందిరా వినవే॥ సరస॥
అనుపల్లవి-గరిమమునరాఘువునియభిషే కమహోత్సవముశుభమన
కభయాకరమనుటయేమిశ్రీరాముఁడు కౌసల్యగానఁజూ
చునను । పరమసమ్మతముగైనకైక వచనముల్వినఁజాలక
మం। దరనీసుతుఁకు నీకుసుఖముదలఁచినాను దాయఁగాను
దెలియుము॥ సరస॥

కైకవినుభరత శతృఘ్నుల కేకయపురికనిచినీకాంతుఁ । డో
కాంతయేకాంతమునసీ తాకాంతుధరణికాంతుగాను । ప్రాకటైశ్వర్య
మునకెల్లను పట్టభద్రునిఁజేయఁదలచెను । నీకునీతనయునకుదాస్యము
నియమించునొకయుపాయమున్నది । నీకురాజుదేవాసురాజినిచ్చి నవర
ములురెండుగలవు । నీకొడుకుదొరతనముకాఘువుని వనవాసమునునా
నసేయుమనె॥ సరస॥ ౧

ఈవిధమునమందరబలికిన హితవనితలఁచిసఖినిమెచ్చుచు । నా
వనితధీజనితకోపము ననుమాసిన చీరఁగట్టివెసను । ఠీవియుడిగిభూషణ
ముల న్నియుఁబాఱవైచియాలుకయింటి । లోవనరుచునేలఁబడి పొరలు
చుండెను దయగలవాఁడైన । పావనుండైధీరుండైన దేవసముఁడైనఁ
గానికుజన తావినోదమును వీడఁడేని తద్గుణానుసారియానునిజమిది॥
సరస॥ ౨

అంతటనుదశరథుఁడు కైక గృహంబునకుఁజనినిశ్శబ్దమై । కాంచి
చెడిభ్రాంతివడిమెలఁగెడి కలికితండము గనికలఁగి విభుఁడు । యింతవిం
తలిదేమియనఁజెలు లెఱుకమాకైకయలగినయది । సంతసము సేయుమ
నవినియా దంతిగమననుడాసినీకీ చింతయేమిటికైకనీదు చిత్త మెటుల
లజేతుననిని । త్రాంతమోహాననుపా దములకప్పుడున్నపుఁడుమొక్కి-
క్కినాననె॥ సరస॥ ౩

పలికిబొంకనివారుమీరలు పాశేశమునుపునాకొసఁగిన । య
లఘువరములకుభరతునిరా జ్యాధిపతిగారామునికానలో । వెలయఁబ
దునాల్గేండ్లమునినై నిలువసెలవియ్య మనుచుకైక । వలుకవినివజ్ర
హతవృక్షము చెలువుననుభువిఁబడియంతలోఁ । దెలిసిచెడుగులకంటిన
నుచుఁ దలఁచివేడఁగకలకంఠినెదుట । పులివలెఁగనితిరుగమూర్ఛిలిన-
చెలులుబోధచేసిరాధరాధిపు॥ సరస॥ ౪

భార్యగానీవుశత్రున్నా పాలిటికినీకురాముఁడుపరి । చర్యయా
శ్చర్యముగసల్పును సతినీవురామునిమెత్తువెపుడు । ఆర్యసమ్మతునిబొ
మ్మననె నతివరాజ్యముగొమ్మనినన్నుప । వర్యబొంకిననరకమునఁబడు
వాఁడవనకైకనలుకదశరథుఁడు । కార్య మేమనుచువనటనొంది కంది
యుండెనారాత్రిచనిన । సూర్యోదయముతూర్యాదిక సుభగనాదశుభ
వినోదములెసఁగ॥ సరస॥ ౫

ఛత్రచామరతురగకరిరథ సముదయముగనుపట్టభూషిత । గా
త్రనిబవిత్రనిసుమిత్రా పుత్రయుతునికరీంద్రాధుని । జైత్రాప
త్రాన్వితునిరామ చంద్రుఁగనిజనులలరియుండిరి । ధాత్రిశుఁడేమోరా
నియ త్తరిసుమంత్రుండుచనిమొక్కిహా । పుత్రిలలామహారామయన
పొగలురాజుఁగనికైకనడు । రాత్రినిద్రలేదితనికిశ్రీ రాముసుగుణధా
ముఁదోడితెమ్మనె॥ సరస॥ ౬

దశరథాజ్ఞ నుసుమంతుఁడుఁజని తగ రామవిభుఁదోడి తెచ్చిన । శశివదనుఁడసితతనుఁడగురఘు సత్తముఁడుతండ్రికిఁబ్రణమిల్లెను బిసరు హాక్షినిగాఁకలించుక పృథివీశుఁడేద్వగవసిష్ఠుఁడు । మసలకనువచ్చెరా ఘవుఁడిదె మనకైకభరతునకు రాజ్యము । అసదృశాటవికినిన్నుబనుప ఁనడిగిననవిబిత్రువాక్యము । విసువక నడపెదన నె శేషగిరిశిఖరాలయుఁడు విశాలమతిమై॥ సరస॥ ౭

౨౧. ఆనందభైరవి – అటతాళము.

పల్లవి–వినవే పల్లవమృదుచరణాకరుణా – వితరణగుణాభరణా।

అనుపల్లవి–జనవిభుఁడానతి చ్చినదండకాటవికిముని వేషధారినై చనియె దననవిని యనఘరాఘవకాముకుఁడనై యతినవలనునేఁజి క్కితిని నిను వనమునకు ననిచిపాృణములీ తనువనయము నవపెనుభూపతి॥ వినవే॥

రామాజగదభిరామా సుబాహుని రామాకులల । లామా హైమవతిచింత్య నామ హాభీమోద్దామగ । గాృమ హాశ్రీమహిత ముఖజిత సోమానిన్ను । నేమనిపొమ్మఁ నెటులనోర్చియుందునీ మోహాబ్ధికిగట్టు ఏదనివిలపింప । నామహీపతినడలవలదని సౌమిత్రి తోఁదల్లి నగరికి । స్వామిచనినతిసుమిత్రికౌ సల్యలకుసేయదీవించి॥ వినవే॥ ౧

అనువందనవనభూమి కరుగకార్యమువచ్చె నమ్మానెలవిమ్మా యనినవిని పొమ్మసిలియాకొమ్మహావనజాక్షునను జేరరమ్మారాజునిను బొమ్మనుటనిజమ్మానమ్మనన నగుచుకైక । తననందనునిదొరనుగా ననుపదునాల్గేండ్లు । వనమునవసియింపఁ జనవిభుని వేడెఁబిత్రువాక్యము। మనుపఁజనియెదననభరతునిక । వనియొసఁగితనయునిచట నెనిలు మను చుఁగౌసల్యవిలపించెను॥ వినవే॥ ౨

నైకరొవ్వరుధరణి కాంతుఁడెవరుచూడునా । ఘోకవరాకానై క నీనైకడఁగిదివిజా నీకములు । ఢీకొనినదుర్వింతుపోనీకరాజ్యశ్రీకినిష ట్టాభి । షేకమిపుడుప్రకటముగఁ జేతుభరతుఁడల్గినతని । నేకయుల తుళ్ళడగింతుననిలక్ష్మణుఁడు । వీఁకనైఁబల్క రాముఁడువిని నీకడిమియు ననీదుభక్తియు । లోకములకెల్ల దెలియునువ త్సానైకపైయలుగవల దనె॥ వినవే॥ 3

జడమునశ్వరముఈజగముగాజ్యముతనువు । సత్యమాయిదినిత్య మాఆస । పడ భోగఫలమానిత్యమా కలిమి । పడఁతిచంచల సుజన స్తుత్యమాభ్రాంతి । యుడుగకుండుట సత్కృత్యమాన । వుఁడ సుఖ మునకు కర్మమొడిగట్టితనకంటె । నొడలువేరని తెలియ నుడుగుకోర్కె లుతృణతతి । వడిమాటగూడియడసినక్రియ మాతృపితృసతి సుతహి తాదుల । నడకయిదిస్వప్నసమమనియునెన్నక జడుఁడుకోరునరా ముఁడు॥ వినవే॥ ౪

ఆయువల్పముజరావ్యాధులుపులులవలె డాయ దెలియఁడాయె నరుఁడు । దానఖిలసుఖములుహేయమనఁ డుమాయురే! భగవన్మాయ దేహ । మేయాత్మయనకుమతి ఛాయామాత్ర । మైయస్థిత్వఙ్మదో మ జ్ఞాస్రిజ్మాంసాస్థి । కాయమాకాయమిట్లాయె నాత్మచెపుమా । యీ యాసవిడువుమహామికభ్రమ హేతువిదియయవిద్యనే నన న । పాయ మగు సచ్చిదానంద బ్రహ్మమను టిదివిద్యయనెహరి॥ వినవే॥ ౫

మొదలుక్రోధముపాపమునకుమనస్తాపమూలము ఇంద్రజాల ముక్రోధము । సదయాత్మలకుప్రతికూలముక్రోధము హృదయగ్రం థికనలావాలము । క్రోధమువైదిఃధర్మములకు శూలముమదియం । దదియుంచకనునినునీవఖిలసాక్షిగానెంచి । ముదమునసుఖియింపుము ఈ జ్ఞానము । మదయుతులకీవల దూలక్ష్మణ మర్మమని పల్కితత్త్వ సదయుఁడై తెలుపఁగాగిటసుతుఁగడియించిపోయిరమ్మనెసతి॥ వినవే॥ ౬

హరిసుమిత్రకుమ్రొక్కియన్నలక్ష్మణనిలువుమన్న మనసు వె
న్నకరణి । కరుగఁబల్కెనీకన్న మునునేనరిగెదననురానీకున్నఁజత్తు ।
పరమేశయనినఁగడుఁ జెన్నారంగ కరుణించియనుజురాకకుసమ్మతించి
యా । ధరణిజను జేరినేదండకాటవికేగి । తిరిగివచ్చెదనిలువుమననీ చ
రణములయాననేనిలువను । బరమాత్మయనిన శేషాచల పతియతివఁ
గూడికదలెను॥ వినవే॥ ౭

౨౨. యదుకులకాంభోజి - ఆదితాళము.

పల్లవి-చికురనిందితాళీరణకేళిజితమురాసురాళీ నిలయాకృత ।

అనుపల్లవి-సకలరాజన్యులుభానుకులరత్నమనిభవనములుడిగిజ । నక
సుతాలక్ష్మణసమేతుఁడై వికసితాంబుజలోచనుఁడైచను ।
టకుగతమేమనితండ్రియాజ్ఞ నడవికిఁబోవుటెఱిఁగి పురజను
లు । పొగల । నకటవగవకుఁడనువారితో సనియెవామ ।
దేవుఁడమ్మునీంద్రుఁడు॥ చికుర॥

ఈరాముఁడునారాయణదేవుఁడు ఈసుఁడవ్యయుఁడుమహానుభా
వుఁడు । శౌరియోగమాయసీతయయ్యెనుకోరి శేషుఁడే లక్ష్మణుఁడై య
లరె జను । లారాబ్రహ్మవిష్ణురుద్రాకారమైపూనిగుణశ్రీ । మీఁజగ
దుదయస్థితిసంహారములు సేయుఘనుఁడుహరి । యీరాముఁడుమత్స్య
.కూర్మసూకర నారసింహవామనభృగురామశ । రీరములుదాల్చియిపు
డు దశరథకుమారుఁడయ్యె ఖలులజంపుటకుచనె॥ చికుర॥

రావణాదిదుర్జనులవధార్థము రాముఁడుద్భవిల్లుటయాయర్థము ।
దేవముని దెలిసిపలుకనతనితోఁ దెల్పె రేపువని కేగెదననియితఁడుధర । ణీ
వల్లభుఁడు కైకహరినటవీవాసముకనుమతిలేదతఁ । డేవారినట్లనియమిం
చెనుదైవాధీనముసర్వజగము । గావుసమీరిందుకై యడలకుఁడీవన
జోదరుహృదయపద్మమున । భావించినఁజింతలెడలుననిముని పలుకేఁ
బౌరులలరినుతించి॥ చికుర॥ ౨

ఆమీఁదట రాముఁడు కైకనగరికరిగియడవి కేగిమాకుముగ్గిరికి
భూపాతియాజ్ఞగొనుమనిన కైకదీమసమునని చ్చెనారచీరలవి । సౌమి
త్రియురాముఁడుగట్టిరి భూమిసుతచేఁగాకున్నను । స్వామిజనకజకట్టెచు
ట్టెను ఏమియనలేకనృపభార్య । లీమానవతికిచీ రేతగదని యేడ్వగ
వసిష్ఠుఁడదరిపడికైక । నీమదిచెడసీతకిదియొసగదగు నేయనిదుకూలము
లవనిజకొసగె॥ చికుర॥ 3

రాజసుమంత్రునిచేఁగుమారులకు రథముదెప్పించనపుడెజనకు
నకు । శ్రీజానిసలక్ష్మణుఁడై మ్రొక్కెను సీతయందఱికి మ్రొక్కెయరద
మెక్కెహరి । జేజేలలరగ తెరెక్కెను జేజేయనిప్రజలువొగడనహా తా
జేయుఁడఖిలధనములు తాఁజేసుకొనిసుమిత్రికొమరుఁడు । రాజిలురథ
మెక్కెసుమంత్రుఁడురథ రథ్యములనడువనిమ్మనదశరథ । రాజువిలపిం
పఁదఱిమినడచిజనరాజితోడఁదమస దాఁటెరాముఁడు॥ చికుర॥ ౪

పుడమిఱేఁడవనిపైఁబడి పురపురఁబొక్కెపొరలియేడ్వభృత్యులధి
పుని । అడరికౌసల్యనగరికిఁగొనిచని రాయువతివిభునిబోధింపుచునుండె
న । క్కడరాముఁడునిద్రించజనులనిటు విడరాదనిపురికిరథముగొని । నడు
రాతిరిసుమంత్రుఁబొమ్మని - యుడురాజనిభాననయును నను । జుఁడు
గూడినడువనపుడెకదలిచని సుమహత్తరంగక పికలుషభంగ । మృధజ
టాజూటసంగ గంగఁగన మెచ్చుశౌరిఁజేర గుహుఁడువచ్చెను॥ చికుర॥

చరణకమలయుగళికిబ్రణమిల్లెడునెరుకువాని రాముఁడుసుఖజల్లె
డు । గురుదయాదృష్టిఁగనికౌఁగిటనిడు కొన్నఁబొగడెగుహుఁడుభక్తిన
చ్యుతుని । హరిధరియించెజటలుమునినైవని జరియింతుననుచులక్ష్మణుఁ
డును । ధరియించెనుసత్యవ్రతుఁడనికురియించిరివిరులుసురలుశ్రీ। ధరుఁ
డుగంగనీటగ్రుంకిజలములుదాఁవితరుమూలమునబవ్వళించె । దరుణితో
డ నటరామచంద్రునా గిరులుగానలేక పురికి బోయిరి॥ చికుర॥ ౬

మాయామానుష వేషధారిత్రుణశాయియై నిదురవోవఁగఁధను । స్నాయకములఁబూనిగొలిచియుండెడు సౌమిత్రితో నిషాదవిభుఁడు పలికెద్రుణ । శాయిశ్రీహరినిటుగనికను దోయిసంతోషింపకున్న । దో యియీదుఃఖమునకు కైకేయి హేతువుగదాయనెను। మాయికముసుఖాసుఖము నెరఁగుతమ కేయెడ లేదనిలక్ష్మణుఁడు వెర । నాయకునకుఁదెల్పగనరుణోదయ మాయె శేషగిరిపతియు మేల్కొనెను॥ చి॥ 2

౨3. భూపాలము - అటతాళము.

పల్లవి-సఖినుశివినవే సీసీసచ్చరిత్రముసలలితానం-దదాయకమనవే

అనుపల్లవి-సుభాజడశుభషష్టిదేర - ముఖాబ్జకాంతిపొదలరఘుకుల
శిఖామణిగుహాసీతానుజుల్ - సేవింపస్నాతుఁడై సుప్రీతుఁడై
లసదఖండ మగుయోడనెక్కియమ-రాపగగడచి గుహునిఁ
బిలిచి సఖాపురికిఁబొమ్మనుచుఁబనిచె-సదయుండై ప్రియత్న
పూర్వముగ॥ సఖి॥

చరణములు-మించిరాఘవ్రులు మృగమునొకటివ । ధించిపచన ముమంచిగాఁగా వించిముగ్గురుభు । జించియచటవసించిమేల్ కాంచి మరునాఁ । డంచితగతిధ రాత్మజరా నుదంచితభరద్వాజాశ్రమము । గాంచిమునికితన వేంచేయుటెఱిఁ గింపఁగాఁబంచిహ షింఁచిరమ్మనిశిష్యుచేనృప పంచాననులువచ్చుటదెలిసి। చంచదర్ఘ్యముగొంచెమురుజన - చక్రినీక్షించితనువ్రుపుల । కించినుతియించమునికనఘులునమస్కరించకౌఁగిలించిరామునిపూ । జించెనుశ్రీరాముసస్మితముఖజితసోముని జగదభిరాముని॥ సఖి॥

నాదబిందుకళాతీతజగ దాదిపురుషమహాత్మవినుసీ । పాదరజముసఁబోదిసేయుము నాదుమందిరముఅనినముని । నాదరించితదాశ్రమమునవి నోదించితదనుజ్ఞనుజనా । స్లాదివాల్మీకాశ్రమముశ్రుతి నాథబంధురముగనిముని । పాదములకునవనిజానుజుల తోఁదవిలివ్రణతుఁ

ధైర్యశాలురను । హాదేవునిసుమాస్త్రరుచిరుని నబ్జదళనేత్రురమాకళత్రు నిశ్రిత । మేదినీసుతాలక్ష్మణులావాల్మీకిగాంచిగారవించిపా । ద్యాదివిధులనర్చించిఫలములర్పించిభజించహరిపలికె॥ సఖి॥ ౨

స్వామివినువనభూమిదశరథ భూమివిభుపంపునఁ జరింపఁగ । మేమువచ్చుటమీకుఁదెలియని దేమియున్నదినేను ఈమానవతి । తో మెలఁగియిచటశ్రీమించినది నేమింపుమనిరాముఁడుబలుక । నామహాని యఖిలార్థసంవేదియై ప్రేమచేఁబల్కెభువనములకు । రామనీవేనిలయ మదినీకు ధామమిదిసాధారణముఁనుత్తమమైన దేవామహానుభావావిను మే మహాత్ములతిశాంతులుసముచ్చాసూయావిరహితులో । శేముషి గలవారిమదినీకుశ్రీయుతముగ నిలనునికియనెను॥ సఖి॥ ౩

శమదమదయా సత్యములుగల సుమతులెవ్వరు శుభాశుభ ముల । సమయములహరివిధానముల భ్రమయరెవ్వరు సుజనబృం । దములఁగూడిధర్మాధర్మ సమరసమువీడి మదినినుశర । ణము వేడిగర్వము దిగనాడి మమతగోరాడియేకమ । తములవారయితనరారుదురువెవ రమితధృతిశ్రీరామనీమం । త్రముజపింతురుద్వంద్వరహితులయి తజ్జనులస్వాంతమునిశాంతమునీకుభవ । ద్విమతషడూర్మిషడ్భావములకు మీఱియవల వెలుఁగునినుదే । హముగసర్వగతునిగనొకనిగ నరయుజనులమదియిలునీకనె॥ సఖి॥ ౪

అనవరతయోగాభ్యాసబలము సద్దృఢీకృత । మనస్కులునిను ప్రతినిమిషమును గనుగొనుచునఘులయిమించు । ఘనులహృద్వనజమున సీతాయుతుడవయి మొనసినవిహారింపు మదియనీకు । ననువైనతావునినువర్ణింపఁజాల నంచుబలికి । వనజాక్షునీప్రభావముచేసనువంద బ్రహ్మఋషినయితిని । జననమాత్రమే జ్ఞానురుడనినిషాదపురిఁ బెరిగి నిలుబట్టనెరిగిబో । యనెలతనొకతెనెనసికొడుకుల గనినేవారి బ్రోవ

జీవుల । మునిమిడి యమునివతెనెచంపుమ ౹ముచ్చులతేడఁడవ నెగడితి నని॥ సఖ॥ ౫

ఈగతిచరియించసప్తఋషు లాగమవేత్తలరుగవారల। సాగిపో నీకాగిననని వేగనీవరగినీసుతుల । నీగరితలనునెమ్మినిబిలిచి భోగఫల ములఁ పోల్కిదురితము । భాగములుగొమ్మనిమీవారి నాగరికమెఱిగిరా మా । తోగర్వమెందుకనజనినే నాగరితనడుగనాలుబిడ్డలు । మూఁగి యడచినమొఱకునయిమఱలి యోగివరులనుగనియడి దెలుపవినికడు । రాగిలియుపదేశమిచ్చి వారవలజనమ రామరాయనివి । రాగి నైజపించి తిపుట్టలు ౹పబలెనాదుతనువృపైననెమునిఁ॥ సఖ ౬

దాంతులగుసప్తఋషులువచ్చి దనరననుదెలుపభానుఁడు । మం తుమీఁఱఁదమమునడచుౖక్రియ వింతగావల్మీకము వెడలి । సంతసమునను సంయములగని సద్భక్తిసలుపధీ । మంతుఁడవు బ్రహ్మఋషివై తివి - దంతదీరెనువాల్మీకియని యంతర్హితు లయిరింతయును శేషాద్రిశనిను మది నుతియించుఫలమిదియని । కొంతబాగడిసురనదికిచిత్రకూటగిరిన డుమగృహముమునుని । కాంతుఁడురచింప సీతాలక్ష్మణయుతుఁడై హరి యుండెనచట॥ సఖ॥ ౭

౨౮. అసావేరి - ఆదితాళము.

పల్లవి-హృద్వనజార్చితరామాయా శ్రితజనాకల్పదామా। సద్వఽచో
భిరామారామావినవె॥

అనుపల్లవి-అద్వయముగ సుమంత్రుడరదముఁగొని యయోధ్యకరిగి -
దశరథునకెఱిగిరఘూద్వహుఁడు జానకీలక్ష్మణునను గూడి
గంగకావలజననృపుఁడు విద్వన్నుత రామచంద్రసీతా విష్ణో
జగత్ప్రభోవిధాతనినుమ । హృద్భావానుభవ యోగ్యుని ।
నడలవాసెనాథునియడలెను॥ హృ॥

పుడమిజనులునినుదయగలవాఁడని పొగడఁగవైకల్యమేటికి । అ
డరినీదుకోరికలన్నియునేఁ డకటాసాఫల్యమాయెను । వెడవెడమేడ్వాక
యుడుగుమనుచు నుర్వీసునిఁగౌసల్య దూరిన । నిడుదగన్నులనీరొడియు
నతనికా నుడియెహృదయశలమాయెను । పిసుగుపడినవానికొఱవిఁ
జూడిన వడువుననేచెదుపాణిముల్నిలదు । పడఁతవినుముపుత్రశోక
మునతనుస్న - వెడలుననుచునొకమునితిట్టెఁదొల్లి । కడఁకనేనుజని వేఁ
టలాడమునికొడుకొకఁడు రేయినదిఘటముముంచ । బుడబుడమన
గజమనిశరమేయన తండహాయతిననె జనపతి॥ హ్రా॥ ౧

డాయఁజని యయోయాయని నేమునిపద తోయజములుదడిపియో
ముని । నాయకనేనపరాధినిదశరథ నరపతిననినుడివిమ్రొక్కిన । సాయ
కవేదనకోర్వలేనునా జననీజనకులడవినొరలెద । రాయెడకేగుమువై
శ్యుఁడనఁగశ రమ్ముఁబెరికివిడివిసేయక । తోయముఁగొనిచని హాకుమా
రకా హాయజ్ఞదత్తాయనిజీరువారి । కాయతమతివలఁగొనియుదకమొసం
గియయో ధ్యావిభుఁడను దశరథుఁడదంటి । నేయమీతనయుఁడీగ్లెననసీ
వు మాయటులనెసుతునెడబాసినపుడెచని । పోయెదవనిగెడసిరనిదెలిపి
మృతుఁ డాయె హారిహారీయనుచు నృపుఁడు॥ హ్రా॥ ౨

మోఁదుకొనియహాయనికౌస ల్యాదిముదితలువిలపింపవసిష్ఠుఁడా
దయితలవారించిశవము తైలముచేఁగ్రాగింపఁబంచటు । మీఁద భరతశ
త్రుఘ్నులబిలువనంపినత్వరదీపింపవారే । డోదినమేవచ్చియయోధ్యఁ
గనిభయ ఖేదములుజనింపఁబురజను । లాదరింపమియుఁగనియుదేమో
యని యంతిపురికేగి కైకకుమ్రొక్కిన । మోదమొదవిసుతుఁ గౌఁగి
లించితన పుట్టినింటిసేమ మరసెభరతుఁడు । మేదినీశుఁడేడని కైకనడు
గవిడి సీతారామలక్ష్మణులనీ । మీఁదిదయచే నడవికనిచితిపతి మృతుఁ
డాయె నాసాలసెనతఁడు॥ హ్రాద్వ॥ ౩

కోంతవడికి సేదదేరిభరతుఁడు కోపదృష్టిఁజూచికైకా । శాంత మూర్తినిగృపాళునిశ్రీరామ చంద్రునడవిఁద్రోచివిభుపతి । హంతివైతి వయయో నరకము నందుపడెదవే చీయనినే। నంతపాపకర్మకుఁగొడుక యితి నింకేలననుచు లేచిపోయి । కాంతుఁబాసిదనరెడుకౌసల్యను గాంచిపాదములపైఁబడియేడ్చిన । చింతయేమినీవు కైకకరుణను స్రీమంతుఁడవయితనిజననిపలుక । యింతికయికకృతమే నెఱిఁగినగురు హింసఁజేసిన ట్లనఁగౌసల్యా । కాంతతనయుఁగౌఁగిటనిడికొని యా క్రిందించెమహారవమెసగఁగ॥ హ్రా॥ ౪

అపుడువసిష్ఠుఁడువచ్చిభరతుతో ననియెనగవ్రు మేలాదశరథుఁ । డపరిమితసుఖము లనుభవించిదివి కరిగెజ్ఞానశీలజీవ్రుండు । చపలజన్మమృత్యురహితుఁడమలుఁడు శాశ్వతుఁడుతిరికాలబాధ్యుఁడు । కపటశరీరమొ జడమనృతమిందు కైకవికారమేలామూఢుఁడు । అపవిత్రమైనసంసార దుఃఖా హతులయిబాంధవ్రులు దెగిరనిపోగలు । నిపుణుఁడు జీవితముచిగురాకుకొన నీరబిందువ్రనుగాఁ దలచుననుచు । కృపచే నెఱిఁగింపన్నృపుని తనువగ్ని చేదహించిక్రియల్ చేసిసోద । రపురస్సరుఁడయి భరతుఁడు శేషగిరిపతి రామునింజూడదలంచె॥ హ్రా॥ ౫

౨౫. మంగళకౌశిక - అటతాళము,

పల్లవి-ఎలమిచే సేవింపవే శ్రీరాముని చెలిమిచేభావింపవే మూలలనా।

అనుపల్లవి-సలలితముగరామ చంద్రునిశ్రీపాద । జలరుహనిష్యంద సద్భక్తిమకరంద॥ మెలమి॥

చరణములు-భరతుఁడామీఁదట బంధుమిత్రమంత్రి వరసేనా పరివృతుడఁయికోసల । పురికిహారిని దేనుద్యుక్తుఁడయివసిష్ఠాదిగురుసజ్జనాన్వితుఁడయి కదలెగంగ । సరిదమలపులినాంతరములవిడిసెన । చ్చెరువందిగుహుఁడు చెచ్చెరశరశాసన । ధరుఁడయియోధులతోడఁదరమినడిచియితఁడు । పరమపావనుఁడేనిసురనదిదాటెంతు । హరికివంచకుఁడేని యరు

గనీతనివచ్చి। భరతుఁరామసేవానిరతు రాజ్యకాంక్షా । విరతుఁగనిమెచ్చి యర్చించె కాన్కల మొ్రిక్కి॥ ఎలమి॥ ౧

కూరిమిభరతుఁడు గుహునిమహామహుని । సారెగాఁగిటనుంచి యచ్యుతుచెంత । జేరినట్టాత్మనెంచియెచ్చటనీవు శౌరినిఁబొడగాంచినా వనియతని । చే రామునువిశ్రమించియున్న చో టారసితిలకించి మొ్రిక్కి యచట । నా రాత్రియుండిమఱునాఁడుప్రొద్దునభా గీరథిదాఁటియరుదా రభరద్వాజ । శ్రీరమ్యచరణరాజీవ ములువలగొని । యారూఢితోవచ్చు టంతయుఁదెలిపిన । త్కారములతనిచేఁ గాంచినాఁడచటశ్రీ । మీఁఱని ల్చిమునిచే దారిదెలిసి వేగ శ్రీరాములుం డెడి చిత్రకూటముఁ జేరె॥ నెల॥

బలములభరతుఁడిమ్ములనునిచిగుహశత్రు । ఘ్నులు రానడచితన పై పులకలునిండఁ । దిలకించెమునిధనమై భలసుమకు । ట్మలపాళికాఘ నమై శాఖశాఖా । విలసద్ఘనాఘనమైమయూరకో । కిలకీరసేవనమై పా వనమైశ్రీ । యలరుపావనముపరిహసితానందనమచటహాల । కులిశధ్వ జనీలాబ్జరే ఖలచాలుపోపోనుసీతారా । ములపాదముద్రిత స్థలులుగని హార్షాశ్రు । లలమికన్నులఁజార ఫలియించెనాదుకో । ర్కులునేధన్యుఁ డనై వెలసితిననియెంచి వినుతించిహరియున్న । నిలయముశుభలక్ష్మీ వ లయముఁజూచెను॥ నెలమి॥ 3

వెలిదమ్మిఱేకులగెలుచుకన్నులవాని వెడదయురమ్మువాని నల్లని వాని । మొలకనవ్వులవాని సీతాలక్ష్మణులతోఁగ్రీడించువాని నారచీర ల జడలఁ దనరువాని నీరేడుజగములనేలినవాని రాముని(జూచి । సలలి తభయభక్తి సంభ్రమాద్భుతములవలగొని తత్పాదనలినములపైహస్త ములుచేర్చిసాష్టాంగముగ మొ్రిక్కికనులనం । గుళములొత్తుచుమేలు ద లఁచుభరతునికృపా । కలితదృష్టిఁగాంచి । కౌఁగిలించితొడల । నెలకొ ల్పెగుహశత్రుఘ్నులు నతులొనర్పఁగ । లలితుండుదీవించి వెలలేనిచ నువిచ్చె॥ నెలమి॥ ర

స్వామి కౌసల్యాదిజనములుతో మ్రొక్కి వసిష్ఠమునిఁగాంచి పూజఁ
జేసి । భూమీశు నెచ్చరించి సేమముగ నీమీఁదిమతమెంచి దశరథుఁ
డని । స్నేమదిలోనుంచిదివికరిగెనన వేమాఱుశోకించిగంగానదికి । రా
ములందఱువెంటరానరిగిస్నాతుఁడై ప్రేమఁదిలోదకక్రియలుదశరథున
కు । సౌమిత్రియునుదాను జల్పికృతకృత్యుఁడై । నేమమునన్నాదినము
నెఱవేర్చిమఱలినిజ । ధామముఁజేరిసత్ఫలములందఱికొసఁగె । శ్రీమీఱ
మన్నించె శేషగిరిప్రభుఁడౌ । శ్రీమహీలావిభుఁడీ లీలవినోదించి॥ నెలమి॥

౨౬. జుజావంతి - ఆదితాళము.

పల్లవి-వినవే దళదరవిందదళసుందర - విశాలలోచననిజకింకరజన
భయమోచన ॥

అనుపల్లవి-మనుకులతిలక అయోధ్యపురమ్ము క్షమాపతివై మమ్ముఁ
బ్రోవుము । ఘనయోగములుచేసిసుతులఁగాంచి తనయుల
రాజ్యము ననునిచిపిమ్మట । వనమునకేగుట రాజధర్మమిటు
వలెఁ జేయుముకైకదురితమతియై । యొసరించిన యపరాధ
ముక్షమింపు మనిభరతుఁడన్న పాదములకు మ్రొక్కెను॥ వి॥

చరణము-భరతునిరాముఁడుతొడపైనిడుకొని కరమును బుజ్జగించి
దశరథ । నరనాథుఁడునన్నరణ్యముపట్టి పదునాల్గేండ్లువసించిమీఁదట ।
పురముఁజేరుమనెనంతదను కేనిను ధరణిఁగావఁగబంచినాఁడిది । యిరువు
గమునునెరపవలెననభరతుఁడిందికేశుఁగాంచిజనకుఁడు । కరటికాముకుఁ
డుభ్రాంతుఁడతనివాక్యమనృతమనవత్సా దశరథుఁ । డరయసత్యవాది
యతని దూరకు మనినసామిమునినై సేవనమునఁ । జరియింతునీవుధర
యేలుమనుఁడు హరియదేటితగవటంచనెనుసీ । చరణముల్ గొలిచివత్తు
ననిన దాశరథివల దయోధ్యకుఁబొమ్మనెఁ దమ్ముని॥ వినవే॥ ౧

శ్రీయెల్ల నయోధ్యయెల్లఁ దనువుత్యజింతుననుచులేచి భరతుఁ
డు । ప్రాయోపవేశమునకై కుశభూశాయియైనఁజూచిరాముఁడు మా

యు రేయనిఖిలగురునికను సైగఁ జేయనతండేచి భరతుని । డాయబోయి
సాహాక్యముతండ్రి మాయలుబోఁద్రోచివినునా । రాయణుఁడచ్యుతుఁ
డీరాముఁడు బ్రిహ్మచేతఁబ్రార్థితుఁడైరఘుకుల । తోయధిఁబుట్టెనురా
వణాదులను దునిమివచ్చునన నతఁడద్భుతముగ । శ్రీయుతు నయుతుఁడై
పాదుకల ర్థించరాముఁడొసఁగమౌళినిడుకొని । తోయజాతసమయాతీ
తమైన వేయనలమునజొచ్చువాఁడనెభరతుఁడు॥ విన వే॥ ౨

కైకసాశ్రిజలనయనయ్యైశౌరి నిమంతనమందురామా । నీకపరా
ధముఁజేసితిఖిలనై నింతపడితనెందుననుదయ । చేకరుణింపుము నీమహా
మహిమ శ్రీనివాసముందుమెఱుకగు । గాకరుఁడవగుణుఁడవువిష్ణుఁడవ
వ్యయుఁడవునీయందులోకా । నీకిముల్ నీదుమాయచేజనన నిలయ వి
యములను జెందును । నీకస్యము లేదు ఇంద్రజాలికుని తెఱఁగునమారూ
మనుజతనువు । చేకొనినటియింతుసీవునీచేలోకులు ప్రీతులై చరింతు
రుది । వాకసకార్యమొనర్చితినీమా యాంకళామోహితాత్మనై నేనునన॥
విన వే॥ ౩

పాహిపాహిదేవదేవనమోఽస్తుపద్మనాభసీతానాయక। మోహ
మనెడి ముడివిడుమనిజనని బొగడనతివ్రతావనుఁడగు । శ్రీహరిచిఱున
గవు దొలుకఁబలికెను చెలఁగిధీసమేతనిజమే యు । దాహరించితివినిర్జర
కార్యార్థమునేనీచేతనిటుల । వ్యాహృతముగ బలికించితినీకుభ వములే
దెదనన్నుదనుపుము । ద్రోహము స్నేహములులేదితనికని దుష్టులనను
దెలియలేరనిసఖగ । వాహనునకు మ్రొక్కికైక వీడ్కొనె వరసేనా
యుతుఁడై భరతుఁడుచని । మోహనముగ నంది గ్రామమున సుబాహు
కంతలుంతనుని దలఁచుచుండెను॥ విన॥ ౪

కుండలిశయానుఁ డిచటజనసంకులమని భూమిసుతాలక్ష్మణు ।
లండదండలను నడువదండకారణ్యముఁజొచ్చి సీతాశ్రితుఁడై యుండె
డియత్రిమునికి మ్రొక్కిన నతఁ డొసఁగెనర్ఘ్యముజితాహితున క।ఖండ

భక్తి ననసూయకు జానకి దండమిడ నభిమతార్థసిద్ధి । దండిగ ననిదీవించి యి
చ్చె గుండలయుగ మవనీతనయకు । మొందుగ జతుర్దశాబ్దములకు కాశ్మీ
రచందనాద్య లంకారములు । నింపుమనంబున నొసఁగెననసూయ నృ
పలలాముఁడగు రాముడత్రిముని । మాండలా ఖండలునితోడఁ దత్వమ
హిత గోష్ఠినుండెసమరస నుతుఁడై॥ వినవె॥ ౫

భాషాపతీసుతుఁడగు శ్రీరాముని భయభక్తులు మీఱఁజేరియ ।
శేషభువనములు సృజించి యవిపోషించుటకు సుదారాకృతులను । వే
షధారివలెఁ బూనెదవునీవు రోషదూరారామాయా । యోషామణి యఖి
లముభ్రమించునది యొదుగునీకు వీరాధవీరా । దోషాచరహారచాపద
ళన పోషితమునిసవనా యనికడు । భూషించె లక్ష్మీఖుఁడు నాచేసి మ్ము
గఁబలుకఁబడిన యీచరితమాంధ్ర । భాషనధ్యాత్మరామాయణమున
బరగనయోధ్యాకాండము రంచించె । శేషాచలపతి పేరనతనికృపచే
సుబ్రహ్మణ్యకవీంద్రుఁడు ముదమున॥ విన॥ ౬

శ్రీమదధ్యాత్మరామాయణ కీర్తనలు - అయోధ్యాకాండము.

స ం పూ ర్ణ ము.



శ్రీ ర స్తు.

# శ్రీమదధ్యాత్మరామాయణ కీర్తనలు.

## అ ర ణ్య కా ం డ ము.



### ౨౭. దేవగాంధారిరాగము - ఆదితాళము.

పల్లవి-శ్రీశేషాచలవాసునివినుతి-సేయనెవరికైనఁదరమా ఉమా॥

అనుపల్లవి-శ్రీశుఁడత్రిముని చే దారెఱిఁగిదినేశోదయకాలమునఁగదలసీ।
తాసుమిత్రిసుతులతో మద వేదండపుండరీకానీకచమ। రీ
శశవరాహమహిషశరభకపీ వృకాదిమృగభయదమైఖగకు
లా। వాసమై ప్రచండమాదండకా వనముఁజొచ్చియను।
జునితోననియెను॥ శ్రీశే॥

చరణములు-మనుజాశన కంటకావృతాధీనము మనమతిప్రయ
త్నముగభూ। జనఖేటముల్గాంచుచు జనకజముందఱ వెనుక రామల।
క్ష్మణు లిరుపురు జనికనిరియసురనా ఘనిమానిఖగవ్యాధుని విరాధుని।
ఘనశూలముద్రిప్పుచు వాఁడువచ్చి కట్టలుకఁ మీరెవరని యడిగిన।
విను రాఘవులము దశరథవిభుపనుపున సుజనులఁబ్రోవ ఖలుల జీవ।
ధనమునుగొనవచ్చితి మనబ్రతికెడి తలంపుగలిగినలలన నొసఁగి చనుఁడ
నికదియ మహాసిచేరాముఁడా దనుజకరచరణశిరములు వరుసనఱికె
శ్రీరామునిఁగౌఁగిటఁ జేర్చి సీతచెలఁగెదుందుభి రవమువిరులుగుఱిసెఁ
ఘోరముగాఁగదు శృంగారముగాసారెకునచ్చరలాడరి పాడిరి। చేరికిన్

రుల్వి రాధుఁజంపుట చేరాజిలిరరికరిహారియైనహారి । దారుభూషణద్యుతి
న సమధృతిసు తారశుభాకృతి నమలాంబరభృతి। తారాపథమధ్యగుఁడ
గుకవిగతిఁదనరిచక్రిధరుని శౌరిని గని । కోరికదీఱవినమ్రుఁడయి మ్రొ
క్కిగుణాఢ్యవిద్యాధరుఁడమర్త్యాసు । భూరిశాపముననున సురనైతినిదె
ము_క్తినీనలననగుటనెవిరాధుఁడు॥ శ్రీ॥ ౩

భవరోగవైద్యదమకర నమోధవళాంబుజాక్షు నినుదలచుచుఁగ
ను । చువినుచునునుడువుచు నంటుచును నవిరళముగ మ్రొక్కుచునుం
డఁగఁజే । యవలెనామనోనేత్రశ్రోత్రజిహ్వాకరశిరములు రామతారక
నామ । భవనుతయనిపలుక హరివగుచునాభక్తి దుర్లభంబదీనీకుఁగ్గలెఁ
బ్రివిమల సుజ్ఞానివైతి పవనవినిప్రకటసుగుణభద్రా రామభద్రా । రవి
కులవరాళియుఁజేరె శరభంగాశ్రమునియుఁగనె సీతానుజుఁడగు॥ శ్రీ॥

చూచియెదుర్కొని పాద్యమొసఁగియ చ్యుతుసుఖాసీనుఁజేసి
పూజించి । నీచమతుల్ఘన సంసారరతుల్ ఓచిత్తజజనక నినుదెలియలే।
రురుతరమగు నీకటాక్షమునునినుఁ జూచితినేని యఃఘములబోఁద్రోచితి
య।హాఁచిత్రమనుచుఁ బలికిశరభంగ యోగితారుపుల్ ప్రోవిడియనల
ము । చేసితాదరికొల్పి యందరికెసీ తాచంపకగంధియుతు హృద్గ్రం
థీ। మోచను విశాలలోచనుమానస మునంమునిచి ముక్తతనుఁడయ్యెఁ
దటి । వేచిదండకావాసులైనమును లాచతుర్భుజునిఁ జేరఁజనిపొడ
గనిరి॥ శ్రీ॥ ౪

మ్రొక్కిరఘూత్తముఁడు మునులారాసుఖ ముగదామీకనినర
క్కసులచేఁ । జిక్కితిమి బాధలసృక్కితిమి గ్రక్కునమముఁబ్రోవుము
నుచురాముని । కక్కడనున్న కపాలముల్ చూపి వెక్కసమునవృద్ధజ
నులమునులఁ । జక్కజేసిరింతయు దైత్యకృతమే శరణు మామొరాలిం
పుమనిన విని । యుక్కడంతుదానవులననియభయ । మొసఁగెమునుల
కెల్ల. మదిరంజిల్ల । మక్కువతో భరతాగ్రజుఁడునిలిచె మాగృహమ్ము

లందుఁ గొన్నేండ్లచట । నక్కడఁ తోఁజని కనియె సుతీక్ష్ణుఁ డనుమునీం ద్రుఁడు పరబ్రహ్మమూర్తియగు॥

౨౫. మంగళకౌశిక - ఆదితాళము.

పల్లవి- వీనులవిందుగవిన వేయాచరితమిమ్ముగను

అనుపల్లవి-శ్రీనివాసునిఁబూజించి సుతీక్ష్ణుఁడుసం మానముగాంచి నా నందుఁడై పలికెను॥ వీనుల॥

చరణములు-రామసీతారక నామమంత్రజపము । నేమమునఁజేసితి నీర జాక్ష।శ్రీమహీళాధీశ శివవిరించిసేవ్య । కామసంసారసాగరతరణచర ణాయని॥ వీనుల॥ ౧

సతిసుతాదిఘోర సంసారాంధకూపపతితుఁడనై।గతిగానని ననుగని నిర్హేతుకదయా మతినై నీవేవచ్చితివనెనుసంయమి । సకలభూతమాన సాలయుఁడవైననుఁ బ్రకటించినిన్నుజ పముసేయని।వికలుల మాయావి వశులఁగాఁజేతు।వకటనినుభజియించ నఘముబాయుకువనెను॥వీనుల॥ 3

విశ్వసృష్టిస్థితి నిలయములకజహరి । విశ్వేశరూపముల వెలయు దీవుహరి।దర్శ్వఁడనేకపా త్రములఁగనఁబడుభంగి శాశ్వతుఁడవిదిమూఢ జనులెఱుఁగరనెదపసి॥ వీనుల॥ ౪

పరమేశప్రకృతికిఁ బరుడవౌనీదివ్య।చరణముల్గంటిదృ క్సాఫ్వం తములకుగో । చరుఁడవుగావైన హరినీనామస్మరణ । పరమతులకెపు డుగను పట్టుదువనెమౌని॥ వీనుల॥ ౫

రూపామ్యపాధిదూ రుఁడవైనమాయానట । నాపాదితమౌని మానవరూపముఇది । గోపాడగంటిస్మర కోటిసుందరముశర।చాపాన్వి తము కరుణాశయనేత్ర మనెనుముని॥ వీనుల॥ ౬

స్మితలలితాస్యముసీతా యుతమజినాంబరము । జితముసౌమి [redacted] సే వితపాదముల । ప్రతిమమసితోత్పలా భముమద్భాగధేయ । శాంతమగునీశు భాంగముగంటిననె॥ వీ॥

దేశకాలకర్త్రా తీతవిజ్ఞానముఖ । లేశనీరూపమతి హితమమలము పాశరహితమ[illegible]పరి కాశమునిఖిలావ । కాశముచిద్ఘనా కాశమనీ పొగడమునిఇ । ఈరూపుభావించి యికనొకటినామనసు । కోరలేదని నమునితోరాముఁడుచె । న్నారఁగఁబల్కెమునినాథనీమదిమత్స్వమా రాధనమువిని ర్మలమాటెఱుఁగు మననె॥ వీనుల॥ ౯

మీానంటిభక్తులఁ బోరివవచ్చితినన్ను భావించివినుతించి సేవించిమా । కీవేగతియనువారి కెపుడుఁజూపట్టుచుఁ । గోవిదుఁడవీవుము క్తుఁడవైతివనేఁజకి॥ వీనుల॥ ౧౦

ఈపావనస్తోత్ర మెవరుపఠించినఁ బాపత్రియమ్మును బాపుదురు । దీపించిమద్భక్తి దృఢమౌసుజ్ఞానము ప్రాపింతురు పరమ । పద మనెనురాఘవుఁడు॥ వీనుల॥ ౧౧

మనమగస్త్యునిఁజూడ జనవలెననిసుతీక్ష్ణయుతుఁడై సీతాలక్ష్మ ణులతోడఁ జనియగస్త్యానుజుని గనియనలశేషశై । లనివాసుఁడగస్త్యా శ్రిమముఁజేరి వినుతించె॥ వీనుల॥ ౧౨

౨౯. నవరోజురాగము - ఆదితాళము.

పల్లవి- వినవేతరుణీ శ్రీరాముని-వినుతగుణస్తోమునిసుచరిత్రము

అనుపల్లవి-ఘనమైన షడృతుధలసుమశోభనమై రాజితబహువిహాగస్వ
నమై తగునగస్త్యునితపోధనమై నరసురమనోసురంజనమై
తగునగస్త్యునితపో । వనమినకులమణిగనిమెచ్చిసుతీక్ష్ణనీగు
రునకుమారాకదెలుపుమనె॥ విన॥

చరణములు-స్వామి మహాప్రసాదమని సుతీక్ష్ణుఁడగస్త్యుని డాయఁజని మ్రొక్కియ । హేమహాత్మసీతాలక్ష్మణులతో రాముఁడిట కువచ్చినాఁడనిన మాని । యామాటవిని హెచ్చియదురేగిహరికి శ్రీ మీాఱనఘ్యమిచ్చి తోడితెచ్చి । రామా యంబుజహితకులాబ్ధిసో మా నీలవారివాహస్తోమ । శ్యామా శ్రీరామాహృద యాభిరామసం

గర । భీమాపాలకడలికడనజుచేమునుప్రార్థితుఁడవైదశరథునినోము పంటవై పుట్టితివనినుతించె । సకలభువనసృష్టికి పూర్వమునం దొకఁడవై నిరుపాధికుడవైయే । వికల్పములేక యున్ననినుజెందిమూల ప్రకృతియైన నీమాయయవ్యాకృత । మనఁగ ప్రకటమై సృజనసేయమహాతత్త్వమన నొకటిగలైమునిగేయదానిక । హంతినమకమై యొకటిజనించెగుణాత్మకమై యహంకారముఖ । రకమ య్యెనుదానివలన యుక్తమై తన్మాత్రి భూతేంద్రియా । త్మకమయ్యెనన్నిటికి సూత్రాత్మకముగులింగమొదవెనందవిరా । టుకలిగిజగములఁ గడుసృజించె వనెముని॥ వినవేతరుణీ॥ ౨

నీవురజస్సత్త్వతమో గుణముల నేర్పుననుగొని బ్రహ్మవిష్ణుమహా। దేవరూపములఁగ్రీడింపుచు జగదుదయ స్థితిలయమును చేయుచుందువు। మాయాగుణభేద భావాభావములనెందవు అవస్థాత్రయములఁ । గేవలుఁడవైకనుగొందువుసా క్షివిచిన్మయుఁడవు । దేవాధిదేవయోమహానుభావా యెపుడుసృష్టిలీలకు । గావాం ఛింతువపుడుమాయను నీవం గీకరించిగుణవంతుని । కేవనుందువామాయ వి ద్యావిద్యలురెండైన దనరువిద్య । యమృతకరమ విద్యమృతవరమనెనుముని॥ వి॥ 3

వినుమవిద్యనొందినఖిలులగుదురు విద్యనెనయనమరులౌదురది నీపా । దనలినభక్తిచేఁగానిదొరకనేరదు గనుకనీసేవఁబూనియతఁడె । ఘనుఁడుకమలజానిపాదసేవకు మొనయనివాడజ్ఞానిస్వప్నమునందైనను । కనరా దతనికీముక్తిమార్గ । మనరా బుధులువేయునేటికిఁ । దనరా రనుమోక్షము బుధ । జనరా జతో డనగతినవిమును । లనరా జనగర్వమోహమద । గుణరహితులుశమదమయుతులుసర్వ । జనహితులుభగవద్భక్తిరతులననెతపసి॥ విన॥ ౪

ఏయుపాయమున నైననీయందుఁ । దోయజాక్షునా కుపరిపత్తి గలుగఁ । జేయుమునిరతము నీదర్శనముసఫలమై । చెలఁగెనాజన్మము

నేఁ డునాశ్రితువులెల్ల । శ్రీయుక్తములారయఁ జూడునాటనుండినేఁ । జే
యుతపమునకు నీడు నీపాదార్చనముగ । దోయి సీతతోఁడనీవహి శా
యి నామదినిల్వుమెందుఁ । బోయి గావుననుని ర్మాయి స్మృతిగలుగ।
జేయునతసుఖ దాయియనుచుఁ బొగడియతఁయ । సాయకతూణీరచా
పకృపాణ సాధనములగస్త్యుఁడు రాఘవునకొసఁగె॥ వి॥ ౫

మేదినిభార హరణార్థము ఈమేనుఁమూనినా వుగావున రావ।
ణాదులజంపు సొమ్ము పంచవటీగౌతమీనది చెంతఁదనరారు రెండు
యోజనము । లమీఁదసది చెలువ్రమీఁఉనఁటకొన్ని నాళ్లువినోదింపు
ముదవుచేకూరగ మా । కాంతావినోదిగర్వితదనుజజయవి భేదీయో
గిజనానందా । పాదీనిరతముజగ దాదీసత్యవాదీయఖేదమణీ । వేదియ
నిపల్కు కుంభభవు పాదములకు నతుండై శేషశైల । వాసుఁడవలఁజ
నె నవనిజానుజులతోఁ॥ వి॥ ౬

౩౦. దేశీయదేవగాంధారిరాగము-అటతాళము.

పల్లవి-చానరోవినవే శ్రీరామ - చంద్రునిచరితమురసభరితము

అనుపల్లవి-శ్రీనివాసుఁడుతో వఁబోవుచోఁబర్వతశ రీరునిజటా। యువు
నిగనిసౌమిత్రితోఁబలికెను॥చాన॥

చరణములు-విలుదేలక్ష్మణా వీనిఁబోలియింతువీఁడసుర। నలెను
న్నాఁడనిన నామాట వినిఖగరాజు । అళుకుచునిచ్చో టరామా నీవు
శ్రీరామానీవు । అలుగకుభవత్పితృసఖుఁడను జటాయువనువాఁడనా
హైటయఁ । బలుకవే యనుడుకౌఁగిట నలమియతనికి హరి సెలవొసఁ
గె॥ చాన॥ ౧

భానువంశమౌళి పంచవటిగౌత మీనదీతటమునం దుఁజేర న
చ్చటరా । మానుజుఁడనువొం దుపర్ణశాలలు ఆపర్ణశాలలు । పూని
రెండురచించెనొకశుభ మైనలగ్నముసీతాయుతుఁడై నరేంద్రుఁడచటని
లిచి యులరుచునుగడపెమూఁడునెలలు॥ చాన॥ ౨

కందమూలములఁ దెచ్చి లక్ష్మణుడు దెచ్చియున్న । ముందరనిడి చరణములఁ గొల్చుచు రాత్రు । లెల్ల జాగరణ ముల్సేయుచును సేయుచుని । ల్లందిశములఁ బూనిసేవా నందుఁడై యుండి యొకతఱిఁగని । మందహాసవదనార విందుఁడగు రాఘవునకనియెను । మోక్షకారణమౌ మొదలితత్త్వమంబు జానకీనవనినసే నుదెలియఁగోరితి । రక్షించు మీకన్న దేశికులులే రక్షయజ్ఞాన విజ్ఞానవిరాగయుతమని దానిఁదెల్పు । మోక్షణం బయునననుజున కిట్లనెను దాశరథీ ధీనిధి॥ చాన॥ ౪

వినుమాయస్వరూపమువివరించి వెనుకసంవిద్రూపుఁదెలిపెదను । ఆత్మయయిన యీతనువె యాత్మగానేననిదోఁచుటేమాయ । అనఘ దానివలన సంసారమౌ యావిక్షేపావరణము । లనెడు యీ రెండౌ మా య కాకృతులనె రాముఁడనువుగ॥చా॥ ౫

పరగ జగములింగాద్య బ్రహ్మాండముగ విక్షేపము సృజించె మించియా । వరణము పరమాత్మనావరించి జ్ఞానరూపమై జ్ఞానరూపమై । పెరసెఁద్రాడహియనిభ్రమసిన ట్లురుమాయచే నైనజగములుపర తత్త్వమునఁగలదను టరయనవిచారమనె రాముఁడు॥ చా॥ ౬

కలలోఁగన్న వస్తువుల వలెనె సత్తుగాదఖిలములు మహేంద్రజాల । ము సంసారమనే బలుచెట్టునకుమూల ముదేహమేనవిదేహమేనని । తెలిపితవాంత్రభూతహృ దింద్రియాహంకారబుద్ధి ప్రకృతులు నహంతయునను వన జెలఁగునన్నిటికాత్మసాక్షియనె॥ చా॥ ౭

జ్ఞానమునకునహంకార మానదంభజయములుక । మానుటబుజుభావము సేవించి భక్తి చేసి జగద్గురుని దైవముగాఁగ నెన్నుట । మేనిదోసము లెఱుఁగుటతనుమ నోనిగ్రహణము ఈషణవిరతి । బూనినాయందనన్యం బయినమతియును నాధనములనె॥ చా॥ ౮

ఆసలన్నిటిజ్ఞానాగ్ని చేదునిమి సచ్చిదానంద చైతన్యమిము తోనని తెలిసి । భాసిల్లునె సౌజన్యము వాఁడె ధన్యుఁడు । డాసియనుభవము

గురుశాస్త్రాభ్యాసమునఁగనిజీవపరులవి । లాసవైఖరులఁగూర్పదొ లం
గుమాయయిదెము క్తియనె॥ చా॥

మచ్చరణస్మృతిలేని మనుజులిది చెందలే । రచ్చపుత్రమములో
నజ్యోతిలేకగన । వచ్చునేయేరికైనఁ గాఫుననన్ను గానఁగ । న్నిచ్చఁద
లఁచువారలకుని మ్మావిద్యమెురులకీవలదని । హెచ్చుగాఁదెలిపెశేషగి
రీశుఁడనుజునకుముదమెుదవఁగ॥ చా॥ ౧౦

౩౧. అఠాణరాగము - ఆదితాళము.

పల్లవి-వినఁగదవేమద వేదండగమన । మన సార సన్నేత్రుచిరిత్రము॥
అనుపల్లవి-మనుజాశనికా మరూపిశియుశూ । ర్పణఖయనెడుమా నిని
వచ్చియపుడు । గనుఁగొనెరఘువరునిజగద్గురుని॥ వన॥

చరణములు-ఆదరహాసమామహోల్లాస మాదరస్మేరకటాక్ష
విలాస । మాదరదళితాబ్జాస్యవికాస మాయిందిరాసఖీసుఖనివాస ।
మైతనర్చుయురముసుందర మైయలరునుదరమునఆనతజన । ఖేదములన
డఁచిమోదములనొసఁగఁ గాదగుచరణపల్లవములు । ఆమీఁదటనఖసౌ
ష్ఠవములుజిగి । పోదియిడుతొడలచందముారామునిపాదపద్మముల
యందముగని । యాదానవిమదనాశుగములచే నదరిచెదరి దనుజారితోఁ
బలికె । ఎవ్వరుమీరుపేమిమీపేరు లివ్వనికిఁలనేతెంచినారు । ఎవ్వారి
కుమారు లీచెలువారు జవ్వనియెవ్వతె నిన్ను వేమాఱుఁ । బువ్వవిలు
కేళిఁగలయఁగఁ బూనినానుబాళినన్నేలుము । నవ్వుగాదనఘనాపేరుశూ
ర్పణఖ, నిన్నేకోరి యిటవచ్చితి మదనుజుఁడిదిగోకనుఁగొను మీసతినే
ననల సాక్షిగాను ఘనతఁ బెండ్లియాడినానటు । వెనుక దీనితోడి యీ
పోటికి మొనసి నీవు నో పుదువె సౌమిత్రి । నెనయు మనినఁ జని వేడి
న నతఁ డనియె లలన నను గూడినసీ । వును దాసి వపుట నిజ మనరా
మునియొద్ద కేగి యదిఘనాకృతిఁగనలి సీతపైఁజన లక్ష్మ । ణుఁ డసి నొ
౦ ముక్కుఁ జెవులు కోసెరక్కసికి॥ వినఁగ॥ ౩

అఱచుచుఁ బారి యది ఖరునిఁ జేరి । మొఱవెట్టసురారి భూరి
రణభేరి । పరఁగఁ గదలి శూర్పణఖచే దారి । నెఱిఁగి బలములరి ము
రినడచె మీఱి పదుల. వచ్చుట గని యనుజుని ధరణిజనుఁదోడ్కొని య
గ్గిరి గుహ । కరుగఁబనిచి రాఘవుఁడు ధనుశ్శర వర కరుఁడయి బలువీ
రుల దార్కొనె । ఖర దూషణ త్రిశిరులు దాఁకిరి హరిపైఁజనునే నుఁగు
లు నాహరి । మెఱయసేన నొకపగలునఁ దెగ । నటికి నారాయణాస్త్ర
మున రాముఁ । డరులదొరలఁ దలల దొరుల నేసెనిలపై॥ విన॥ ౮

తమ్ముఁడు వచ్చి సీతను దోడి తెచ్చి । యమ్మోయి నన్న సాహస
ము మెచ్చి । నెమ్మినుండె సుఖమ్మున హెచ్చి । యమ్మది రక్కసి య
టలంకఁ జొచ్చి । పమ్మి రావణు చరణములఁ బడి వగవనతఁడు కరుణఁ
జెలిఁగౌఁగిటఁ । గ్రిమ్మి యిదే పున రామలక్ష్మణులు కాంతారసీమ మె
లఁగ రాముని కలికి చెలువలరి చె । లఁగఁగా నీకిమ్మన నన్నిటుచేసిరి నీ
తమ్ము లిందుకై పొలసిరి యనిన । కొమ్మనూరార్చిర క్షోణిభుఁకు రా
ముని । నిమ్మహి శేషగి రీకునిగాఁ దలఁచె॥ వినఁగ॥ ౯

౩౭. ఘరజు - రాగము - అటతాళము.

పల్లవి-ఇంతిచెంగల్వ బంతిచెలువల మేల్బంతిగుణముల దొంతి
వినవే శ్రీ

అనుపల్లవి-కాంతుఁడు డీకొను ఖరదూషణాదుల నా । వంత లోపలఁ
జంపనెంత వారు నరులని । చింతించి దశకంఠుఁ డసురుల
శిక్షింపఁజక్రి యిన కులమున మంతు కెక్కఁజనించె శ్రీరా
మాఖ్య బ్రహ్మాది నుతుండయిమనె॥

చరణములు-ఐన గానిమ్మని శ్రీహరి చేతఁబొలిసితే । మానుగ
వైకుంఠ మందిరమేలుదు । నే నతని గెలిచితి నేని రాక్షస రాజ్య ।
మీనేల గలదనుక నేలుదు ననిదలఁచి । భానునిభమగు రథమెక్కి

విధి పూని బోరేప దుర్మతివై । రానుగత హృదయుండయి చనియెను రావణుండు మారీచు నింటికి॥ నింతి॥ ౧

వచ్చిన దనుజేశుఁ జెచ్చెరఁబూజించి । వచ్చిన పని దెలుప వలె నన్న మారీచు । మచ్చికచేసి రావణుండు పలికె రాముఁడు । హెచ్చి కానకు దశర థేశుఁడు బంపంగ । వచ్చి మునులకు నెల్లనభయం బిచ్చి మన ఖర దూషణాదుల । వధిచ్చినాఁడట రాముని సతినిదెచ్చి యేలు దునన నతండనియె॥ నింతి॥ ౨

రాముఁడు నరుండని రావణతలచేవు । శ్రీమహావిష్ణువు సీత మహాలక్ష్మి । యీమేను బూని నాఁ డిచట నిను బొరిగొన । నామహాత్ముని చెనకు టదియే మృత్యువు వినువి । శ్వామిత్రుక్రితువున సుబాహునిఁ జంపి రఘుపతి నన్నుశరమున । నీమహోదధివైచె బ్రిదికితి నేమి సుకృతముకతననో యనె॥ నిం॥ 3

హరి నన్ను బొలియింప నవతరించిన ట్లయితే । వెరచితేఁ జంపక విడుచునా లేలెమ్ము। మెరసి నీవు మాయా మృగమై రాఘవుల స। త్వరముగ భ్రమియింపు ధరణిజ నేఁదెత్తు । మరుమాటలాడనినుఁ జంపుదు మారీచయని రావణుండన । వెరచిహరిచేఁ దెగినమోక్షము వీనిచేఁ బడనేలని కదలె॥ నిం॥ ౪

పదియారు వన్నియ బంగారువలెఁదనువు । పొదలమేనిపై వెండి పువ్వులవలె చుక్కలు । గుదిగొన మణిరుచులఁగొ మరారు కొమ్ములు। కొదమ రత్నము లనఁగా గొరిసెలు దనరఁగ । నుదుట నీలముల వలెఁ గనగవ యొప్ప మారీచుఁడు లేడియై । కదలి శేషగిరీశుఁ డగు రాఘవుఁడున్న పంచవటిఁ జేరెను॥ నిం॥ ౫

## 33. నాయకిరాగము - ఆదితాళము.

పల్లవి-దీన భక్తజన సౌఖ్యదాయకి ప్రాణనాయకి వినవే

అనుపల్లవి-భానుకులుఁడు ఏకాంతమున సీత తో నిట్లనె రావణాసు

ర్చుఁ డిదె నినుఁ గొనిపో నరుగుదెంచె నీవంతర్హితవై నీదగు ఛాయామాత్రము నిలుమీ నిను వర్షాంతమునందు పొందు వాఁడననట్లనిల్చెసతి॥ దీన॥

చరణములు- చెలఁగు కపటమృగముఁ జూచి మాయాసీత దీనిఁ గొనితెమ్మనినశౌరి విలునమ్ములు గొని చనుచు జానకిని గొలిచి యుంచు సౌమిత్రి నేనీ లేడినికలితనము మీఱదెత్తు ననిన లక్ష్మణుఁ డిదిమారీచుఁడు చేయు పోకలు వల దీ కార్యము పూనఁగా న గారిస్తుత యన నిల్వ కేగె హరి॥ దీన॥ ౧

సర్వపూర్ణుఁడయ్యు నచలుఁ డయ్యును సాక్షియయ్యు లోకానుసారియై పర్విడి మాయామృగము వెంటఁదగిలె భక్తపోషణుండ నెడి నుడి విదితముగా నుర్వీతనూజ కోరికదీర్చ కనుద్దండాటవి రఘువీరుఁడు చని దుర్వారామర్షణుఁ డయి మృగంబు నుర్వింబడ నేసె నిశితాస్త్రమున॥ దీన॥ ౨

తుళ్ళిపడంగి కపట రూపు చెడి మారీచుఁ డొరలుచో హా లక్ష్మణా చెల్లరేనన్ను బ్రోవుమని చక్రిచీరినటులఁ గూసి నార్తరవమున నిలపైఁ ద్రెళ్లుచు మహీశు సన్నిధిచే ముక్తిం జెందె నచటనార్తధ్వని విని తల్లడపడి భూమిజ రాముఁడాప దంబొందెను జను లక్ష్మణా యనెను॥ దీన॥ 3

మూఁడుజగము లనికి దొడరిననురా ముఁడుభయమూర్తుఁడౌనె చెలియ తెలియకనాడితివను మఱఁదిని యతివ సుజను లాడ రాని మ్మాటలాడ నాతం డది వినఁగూడక హరీ యనుచు నన్న చనిన జాడం జన రావణుఁ డిష్టము చేకూడె ననుచుఁ జేరెను మాన్యుడై ని గూఢాత్మాకృతియై ధరా సుతను॥ దీన॥ ౪

పూజచేసి సీత పలికె మహా పురుష నిలువు మత్పతి వచ్చు దనుక నా జనకజ గని మీరెవరు దెలుపు నాతి యనిన యమోఘ్యాధి

పతి యగు దశరథరాజు కోడలను రాముని భార్యను లక్ష్మణుడను తమ్ముడుదానును వసి రాజీవాక్షుఁడు పదునాల్గువత్స రంబుల్ నిల జనకాజ్ఞ వచ్చెననె॥ దీన॥ ౫

నిన్ను వింటు వన రావణుఁడ నా నెలవు లంక దను జవిభుఁడ జగములనన్నిటిని గెలిచి నాను ననుఁబొందు నరునిపొందు నీ కేంచుకన విని భయంబున నన్నెలత యోరి ఖలుఁడ నిను రాముఁ డస్త్రాహతుఁ జేయు నన రావణుఁడెన్నికఁ బదితల లిరువై కరంబు లిమ్మైతగ రథమందు సీత నిడె॥ దీన॥ ౬

అలఘుగతిని బోవ శేషగిరి నిల యా హరీ రామ లక్ష్మణాయనుచుఁ । గలికి విలపింప విని జటాయు వది దెలిసి వచ్చి రణమొనర్చి కూలెను గిరిన ల్లె । గులుకుచు దశాస్యుఁడరుగ గిరిన్నైదు గురు కపులను గని తొడవుల్ ముడి యిడి। చెలి వైచెనచట లంకాపురంబుఁ జేరి యశోక వని సతి నిలిపె॥ దీన॥ ౭

## ౩౮. లలితపంచమి రాగం - ఆదితాళము.

పల్లవి-ఓవనితా మణిరో వినవే నొకటి దలఁచే॥ నోవని॥

అనుపల్లవి-వేవచ్చు లక్ష్మణుని వీక్షించి హరి మది। నే సాక్షినాదు నైన నీ జగము మాయా మోహా। వ్యాసంగ మొందఁ జేతునని యెంచి। హా సామిఁ త్రీ హా సీత నచట డించి నత్తురా తప్పుఁ। జేసితి వింక నేమి సేతు ననిన రాముని గని యతఁడు పలికె॥ నోవని॥ ౧

చరణములు-ఆర్తనాదము విని యానవిజ నన్నుఁ బొమ్మన్న। నార్త రక్షకుఁడతని కడలకు మనిన। నార్తిచే వినరాని మ ర్మోక్తులాడ నీమార్గాన ఆర్తినై వచ్చితి నన్ను మన్నింపవే యో దయానిధి యనె॥ నోవని॥ ౨

ఆమీఁదఁ బర్ణశాల కరిగి సీత లేకున్న । రామ చంద్రుఁడుశో కవా రాంబునిధి మునింగి । తా మహామహుఁడయ్యు నిర్గళిత దుఃఖరా శి యయ్యుఁ బామరులకుఁ జూడఁ జింతా పరవశుఁ డైనట్లు విలపింపఁ దొడఁగె॥ నోవని॥ 3

హా పూర్ణ చంద్రానన హా చకోరాక్షి యింత । కోపమానా తోఁ బలుక కున్నా వేమి । ఓపరమ సాధ్వి యింక నేనె ట్లోర్తు నిమి ష మొకయుగ మాయెఁ । బాపపు దైవ మింత పగవాఁ డా యెరుగన ని వనితను వెదకె॥ నోవని॥ ౪

వెదకుచు రాఁగా హాత పక్షుడయి పడియున్న । పతగేంద్రుఁ గని లక్ష్మణా పరికించితే।అతివ నీతఁడు మ్రింగి హాతుఁ డయినట్లున్నాఁ డు వీని । ధృతిచేఁ జంపుదు విలునమ్ములు దెమ్మన రామనే జటాయు వనె॥ నోవని॥ ౫

హరిహరి యని డాయ బోయి యతనిచే దద్విధ మెల్ల । నెఱిఁ గి పక్షిరాజుమై కరమున నిమిరి । పరగబోధించిన రామా హరి పర మాత్ముఁడవు నిన్ను । కరమర్థిఁజూచితి ముక్తి గంటెననిప్రాణముల్విడి చె నతఁడు॥ నోవని॥ ౬

ఛితిపేర్చి పులు గుమేనుశిఖచేదహించె నంత ధృతశంఖచక్రగ దాబ్జా న్వితుఁడయి హితుఁడయి । నతుఁడయి రుచిర తనుఁడయి పర మ విమా నా రూఢుఁడయి జటాయు । పతిభక్తి శేషాచల పతి యగు రాముని నుతియించఁ దొడఁగు॥ నోవని॥ ౭

౩౫. చూర్ణిక - జటాయుస్తవము,

శ్రీ మ దగణిత గుణమణి గణాలంకృత రుచి రచిత శుభస్వ రూపం; సకలజన భయావహ దజ్ఞాన జనితకలుషాంధ తామిస్రనివా రక భవతారక దీపం; అనుపమాద్భుత మహత్త్వతాపంహత దీన జన తా మనస్తాపం; కరధృత విధి తామోఘ శరచాపం జగదుదయస్థితి

సంహారా విర్భావ తిరోధానాది మహామాయా వినోద నిదానం; అంగీకృతరంగ న్మంగళా భంగ తుంబురు నారద సంగీత వీణా మృదు గానం; భూత భవిష్యద్వర్తమాన కాల త్రియీ బాధ్యమానం, అస మానం; అక్షీణ కటాక్షవీక్షణ రక్షితదాక్షాయణీ ప్రముఖ నిఖిల భ క్తజన సమూహం నిర్గళిత సకలసందేహం, దుర్వారోర్వీభరణ హరణ నిర్వహణ చరణ లీలా మానవ దేహం నిరీహం; శ్రీమత్కరుణావలో కన మాత్ర క్షమిత ఫాలాక్ష చతుర్ముఖాది సర్వ సుపర్వా ఖర్వ ఖేదం, నిరంత రామనస్క సమాధి పరిపూర్ణ పరమ యోగీంద్ర హృదయ సరసీరుహ కర్ణికో పరిస్థిత విగత జగత్పవిత్రీకృతాద్భుత ప్రభావ భా సుర వియన్నదీ జనక విభవాభి శోభిత కిసలయమృదుపాదం, సమస్త జనానుమోదం; నతజన సంతత సకల కల్యాణగుణ సంపాదం, దళ త్పుండరీక పత్రజైత్ర విపులతర మనోహరవిలోచనం; శిలామయ మానియోషా ఘర్షణ దోష విమోచనంకుముదబాంధవ కిరీట ప్ర చండ కోదండ ఖండనోద్దండదోర్దండదోషాకరాస్యందేవతా సార్వభౌ మం; రవికుల పయఃపారావారపరిపూర్ణ సోమం; గర్వితపూర్వగీర్వా ణ వాహినీ సందోహ కఠిన కంఠ లుంఠన గళచ్ఛోణితా రుణిత సహ స్రకర సహస్రకోటిప్రభాభాసమాన మహాభూత భయంకర సురర్వా భిధానావక్ర చక్రాయుధా భిరామం; మారీచ సుబాహు విరామం. హారహీరనీహారకర్పూరసుధాసార డిండీర శర స్నీరద శారదా నార దపూర్ణిమాచంద్ర చంద్రికా ధిక్కార దశదిగ్వ్యాపిత ధవళ యశో ధామం; శ్రీరామం జనన మరణాది ఘోర సంసార మహాగహన దావ దహనాయ మాన సకలజగజ్జేయమాన పావననామధేయం సూ రి జన భాగధేయం ఇంద్రనీలమణిప్రతికాశాతిస్ఫుట సుందరకాయం. రమాకాంతా కుచకుట్మల తటి చర్చితపటీర కుంకుమ సంకుముద మి శచ్చందన పంక ముద్రితశోభన విశాల వక్షసం హత ఖరదూషణాది

రాక్షసం రూక్షేక్షా శిక్షితపక్షం ప్రపన్నావన దీక్షం పరధన పరదారా విముఖమునిజనసేవ్యం దుష్టజన దుర్విభావ్యం. ప్రణవైక సంస్తవ్యం, ప్రతిపీఠికాశ్రావ్యం; విలూనదంభాభిమాన సదా భువన సంస్తూయమానమానవవపుర్నిర్మాణా సమానమానస సరోవరముహుర్ద్గత సముత్తుంగాఖండానందం వీచీ పరంపరా లీలా డోలాందోళితచిన్మయరాజహంసం, రాజకులావతంసం; రత్న ప్రభా చకచ్చకిత చామీకరచారుకిరీట కుండలం, పోషితాఖండలం; గుణత్రయ శక్తిత్రయమూర్తి ప్రియానువృత్తం, కరుణామయచిత్తం; పనసామ్రకదళీక్రముక ఖర్జూర జంబు నింబ జంబీర పున్నాగ చంపక మధూకవకుళాశోక తమాలసాల రసాలాది కోరకిత పుష్పిత ఫలిత లలితమహామహీజ కుహరా విరాజిత రత్నచ్ఛవిచ్ఛటా లంకృతసానుప్రదేశ నిరత సముత్పతన్నిర్ఝరాకళితప్రశస్త సమస్తశిలా సోల్లసిత శేషాచల శిఖర మధ్య సువర్ణప్రాసాద విహారణశీలంతోషితాశేష భూపాలం; సురాసురయక్ష రక్షోరగ గరుడగంధర్వసిద్ధ సాధ్య కిన్నర కింపురుష విద్యాధర చారణా ప్సరో బృందరచిత బహువందనం; భక్తచందనం; రఘునందనం; తాం భజామి.

౩౬. శహన - అటతాళము.

పల్లవి-కోరి కూరిమి మీఱి కౌమారి ఖ - రారి చరితము వినవే

అనుపల్లవి-శ్రీరాముఁడు జటాయువు భక్తికిమెచ్చి । మీఱఁగఁగైవల్య
మిచ్చి యీవలఁ జని హెచ్చి

చరణములు-సానుజుఁడై సీతనరయుచురాముఁడు జని ఘోరాకారుఁడైన రక్కసునిఁజూచి మాసధనుఁడౌ లక్ష్మణునితోడఁ బలికెను వీని బాహువులలోన నిప్పుడు మనము । పూని చిక్కితిమి కన్నులుఁగాళ్ళుఁ దల లేదు వీని కేరని తెగువలోన రాఘవులిరువురు । వాని

యోజన దీర్ఘ బాహు ద్వయముఁ దెగనరికినఁ గబంధుఁడుదాని కద్భుత
మంది మీరెవ రేనెఱుఁగ ననఁజకి పలికెను॥ కో॥ ౧

దశరథసూనులము రామలక్ష్మణులము తండ్రియాజ్ఞ వనమున
నుసీతతోడ । వసియించియుండగాము వంచించియెవఁడోనా వామాక్షిఁ
గొనిచనెను వెదకుచువచ్చి । వెస నిన్నుగంటి నీవెవండనిన గంధర్వ
విభుండజుని వరమునను జరజీని యగు । కొసరిఋష్టావక్రముని గనుఁ
గొనినేఁ దిన నసురగ నగుమని త । పసి శపించె విమోచనము రఘుప
తి సేయునసెను దైత్యుఁడు॥ కో॥ ౨

దనుజతనువుగాల్చు మెఱిగింతు సీతా వృత్తాంతము నన్నిట్లు సే
యమెఱుఁగరుడీని । ననననురాకృతి విడిచి దివ్యగంధర్వుఁడై వినుతిం
చె హరినిమాయ మానవకాయ । అనఘుసృష్టనిగ్రహార్థముబూనితివి
పరమాత్ముఁడవు దైవరా య సన్నునిగేయ । మనోరాగగోచరు జన
నా దినిధనుఁడవఖిలసాక్షివి । చిద్ఘనానందమయుఁడవు రఘునందన
వందనములు చేకొను నే॥ కో॥ 3

రూప రహితుఁడ వయ్యు రెండు రూపములు గల వోపరమ
పురుష నీకుస్థూలసూక్ష్మముల । ప్రాపున జగములు గలుగువెలయు
నడఁగు నీపాదమూన పరా కు హిరణ్యగర్భ । ఏపునసూక్ష్మమై విరాట
మవు స్థూలమై దీపించె నదిమాకు దెలియునుమును లలమట । కోరి
ధ్యానము సేయఁగ విరాట్పురుషుఁడనధారణా క్రియుఁడను । చేపట్ట
రాముని తనువె సుమ్మఖిల జగముల ననెఁ గబంధుండు॥ కో॥ ౪

వానిజ్ఞానము మెచ్చి వరదుఁడు పలికెను వరమా నీపావనస్తవ
ము నుడివిన వినినగాని, వారికి సిరులుఁ గలుగు దురితముదొలఁగు గలు
గదెన్నఁడు భయమని సెలవియ్యగానె రావణుఁడను రాక్షసుఁడు సీత
ను లంక లోనుంచి నాఁడీ దినము శబరివద్దకి జనుఁడా నెలఁతచే సక

లమును వినఁ గానగు ననుచుఁ గిన్నరుఁడు చనె । భానుకులమౌళి శే
షాచల పతి మతంగాశ్రిమముచేరెను॥ కోరి॥

32. మాంజరాగము - అటతాళము.

పల్లవి-హితమతిసతీ పార్వతీ యీచరితము వినవే
అనుపల్లవి-రతిపతి శతాధిక రుచి రాంగులా రామలక్ష్మణుల । నతి
వేడ్కఁజని యానం దాబ్ధి దేలి శబరియొకర్కొనెను॥ హిత॥

చరణములు-పద యుగళి మ్రొక్కి పాద్య మొసఁగి । తదం
బుకణార్ద్రిసదమల సర్వాంగియై హరి దర్శన । ముదితవిరోచన జిత
సారంగియై రాఘవులను స । న్మృదు ఫల గంధమాల్యములఁ దృప్తు
లఁజేసి హృదయముల । ముద మొదవ బలికెను రామునితో శబరికర
ఘటితాంజలి యగుచు॥ హిత॥ ౧

నిను కని ధన్యనై తనరితీ ఖలుల దునుమగ మునుల మనుపఁగ
దశర । థుని సుతుఁడై నారా యణుఁడ జనియించుదు । వనినాగురుడు
సువ్రితుఁడై దెల్పెను మతంగ । ముని యదినేఁడునిజమాయె శరణు
శరణు దైవరాయా । వనితను హీనకులజను నినుఁదెలియఁజాల నన
రాముఁడు పలికె॥ హిత॥ ౨

కుల నామా శ్రిమాదులు హేతువులుగావ । బలననుదెలియఁ
గ భక్తియొకటి వినాగఁజన దాన తపో మంత్రి । ములు భక్తిహీనము
లైన నిష్ఫలములు గనుక । దెలిపెద భక్తిమార్గము సులభ మగు న
పవర్గము । తొలుత సత్సంగతి యావల సత్కథాలాప గుణరతులను
నేను॥ హిత॥ 3

ననుఁగొనియాడుటయు ఘనగురుసేవ యు । మ నియమాదుల
ను నను బూజించుట । ననుభజించిన వారలను గని సంభావించుటః
సకల భూతములఁ । దనుగాఁ గని శమదమములు నెనయుట విమల భ

త్తములు । ననువివరించుటయు నివి నవవిధభక్తు లనిమరల హరిపలికె॥ హిత॥ ౪

భావము సజ్జనసేవ పదిలమైనదినీకుఁ । గావునను జూడఁగాఁగలిగె నిఁక జానకి తెరఁగు వేవేగమెజూడగా । దెలుపుమనసతిని రావణుఁడెత్తుకొని వేగ లంకకుఁ జనె మహాభాగా । దేవాదిదేవనీకుఁ దెలియని దిగలదే యనుచు జెలి పలికె॥ హిత॥ ౫

పంపానామ సరో వరతటిఋశ్యమూకాద్రిపైఁ । బెంపునను గ్రీవుఁడున్నాఁ డతని సఖ్యము చేయుఁ । డింపున నతఁడు దోడ్ప డునని తెలిపి శబరి । తెంపుననచటఁజితిఁబేర్చి దేహముచిచ్చుతోఁగూర్చి సొంపున శ్రీవిభుని దలఁచుచు దనువెడసి పరమపదమున కరిగె॥ ౬

ఈరఘువర స్తవము నెవరు పఠించిన వినిన । వారి కోరినకోర్కెల నిచ్చు శేషాచలేశుఁడు కృపను । ఘోర దురితములనుబుచ్చునివి జయాకరము । సూరిజనా నందకరము దారిద్ర్య సంకట హరము అరణ్యాకాండముశ్రీ మీర సుబ్రహ్మణ్యకవి తెనుగించె॥ హిత॥ ౭

శ్రీమదధ్యాత్మరామాయణకీర్తనలు ఆరణ్యాకాండము.

సంపూర్ణము,



శ్రీవేఙ్కటేశాయనమః

# శ్రీమదధ్యాత్మరామాయణ కీర్తనలు.

## కిష్కింధాకాండము.

### ౩౮. మారువరాగము - ఝంపతాళము.

పల్లవి-శ్రీహిమాచలవరసుతా యీకత స-మాహితమతివైవినవే

అనుపల్లవి-మోహనాబ్జోత్పలా - మోదయుతమై విమలమైహంసచ
క్రవాకాదివిహగకులకో । లాహలమైపన సామ్ర వకుళ
కందళితతరువిలసిత తీర । మై తగు పంపాతటిని డాసి । సా
హస క్రమ కళాకుశలులగు రాఘవులు స్నాన । పానము
లుచేసి శ్రమముఁ బాసియలరిరి॥ శ్రీహి॥

చరణములు-వరఋశ్యమూకాద్రి సరణిఁదప్పకనడుచువారి శర
చాపధరుల నృపవరుల మరుజటావల్కలం బరులఁజూచి వెరగొంది
సుగ్రీవుఁ డరులని తలఁచిమంత్రి । వరుఁడైనహనుమంతు వారినెఱు
గఁగఁబనుప నెఱవడుగైచని మారుతి శిరముపోక రామునియంఘ్రిల
నతుఁడై జగదుదయ స్థితులయ కరణ శీలురై పురాణ పురుషులై తన
రు । నరనారాయణులో గాక మీరెవరని యడిగెను॥ శ్రీహి॥ ౧

వినులక్ష్మణా యితని ఘనవాక్పటిమంబు వినుతశబ్దశాస్త్రమత
మైశ్రుతిహితమై విని చెనని హరివటువు నతిమైత్రితోఁగనినే దాశరథి
వినురామఁడందఱునా యనుజుఁ డితఁడు లక్ష్మణాఖ్యుఁడు సీతయును
నా వనిత మున్నేనితఁడు । నడవుల చరింపమజ్జనకుశాసన మున వచ్చి

చపలటిమండ్ర। దనుజుఁ డెవఁడో కన్నెఱఁగి సీత నెత్తుక చనె దానిచే ఖేదము నీవెవరో। తెలుపుమన రాముఁడు। వానరేంద్రుఁడు సుగ్రీవాఖ్యుఁడీగిరినమాత్యులుఁ। దానున్నారు వాలికి భయపడి మహానుభావా ననుమీపాలికిఁ బంపె। నేను సుగ్రీవు మంత్రిని వాయు సుతుఁడ హను। మానాహ్వయుఁడ సూర్యసూనునకు నీకుఁ జెలిమి। మానితముగను జేసెద ననుటకు రాఘవులు ననుమతింపవారిఁదనమూపుపైనిడ తెచ్చి భానుజు కెఱుఁగ చేయఁ జెలంగి రాముని పాద పద్మముల కెఱగి తరుశాఖపీఠ మిడియెనతఁడు॥ శ్రీహి॥ ౩

రామాభిగమనంబు సౌమిత్రిచేఁ బ్లవగ రాజు విని రిపు విఘాలా వగపేల భూమిసుతజూడ యేలీల నైనం దెత్తు స్వామియొకదనుజుఁడొకసతి నెత్తుకొని పోవ। భారమై తోడవ్రలిటు పాఱనైచె నని యియ్యు రాముఁడు గని హా సీ। తా యనివిలాపింపఁ। బామరుని రీతిదైన్య పడఁ దగదని విరజుఁ డా మహామహుని దెలిపి యగ్నిసాక్షి। కముగ బ్రామాణికములు చేసికొనిరి సఖ్యమునకై॥ శ్రీహి॥ ౪

మయసుతుఁడు మాయావి వాలి ననిఁ బెనఁగి। పురిలోడియసుర తొలఁగి గుహఁజొఱ నిర్భయుఁడై వానితోడ చెలఁగి యచట। దయచే నన్నుంచి పోయి మాసెలకురాకున్న। లయమాయెనన్న యని చలఁచి గుహను శిలదోంచి। భయమునఁజని యది దెల్పసచివుల్ ననుఁగపి పతిని జేసిరఁట। బోరికొని మాయన్న వచ్చి ప్రియను రాజ్యమును గొనినను। దరిమిన శేషగిరీశ అదిమొదల్ ఇచటనునికి యనె నినజుండు॥ శ్రీహి॥ ౫

౩౯. కళ్యాణి రాగము-అటతాళము.

పల్లవి-తగ వినవే యీచరిత్ర దళ - త్కంజ దళ మంజు నేత్రా॥
నగవిభేదన మణి చయ కాంతి స్ఫుట సుగాత్ర స్తుతి
పాత్రా॥

అనుపల్లవి-వగఁబొగలు రవిజుఁ గని హరి నీ పగతుఁ డని మొనను
బలాధికుఁ ।-డగు వానిఁ గెలువ నెట్లగు నని । యతఁడన్న
బలమెన్నఁగఁడఁగెను॥ తగవిన॥

చరణములు-దుందుభి యనెడి దనుజుఁ డాహవ దోహలత మ
హిషరూపుఁజెంది వానిని దొడరంగఁ గొమ్ముల సందెడలఁ జీల్చి య
తఁడేపు । మ్రిందించి కాలఁదన్నిన త ద్రక్తమిగిరినెఱయ వాలిని
'ఇందురాదల పగులు' నని శపి యించెను మతంగుఁడనె గపిపతి॥తగవి॥

అది మొద లిచటనుందు నభయత ననఘ దుందుభి శిరంబు ।
అదె యోజనము చిమ్మినవాలి సని గెలుతు వన విని ముదంబు । గ
దుర పదియోజనాల్ చిమ్మినఁ గని సప్తతాళ పత్రములంత । గదిమి
యొకమటి గోయునటుల వి చిగుము మన హరి నగివిలుఁగొనియె॥తగ॥

శరమొకటి శ్రీరాముఁడేసిన సప్తతాలములఁ దున్రించి । గిరిధ
రాతలరసాతల ముల నెఱఁగి పొదిచేరెనదిగాంచి । తరుచరాధిపుఁడురా
ముని పా దముల కలరుచు మ్రొక్కి శరణని । చరా చరమూలమైన
పరా త్పర వస్తువని పొగడఁ దొడఁగెను॥ తగవిన॥ 3

నా పూర్వపుణ్య ఫలముజగ న్నాథ నిను గనుట నేరు । ప్రా
పనితలంతుర్రి నినుసంసార నివృత్తికై గనులఁ జూడు । శ్రీపతి సతిసుతధ
నము కాంక్షించి బుద్బుద సమంబది నీప్రాపు పెన్నిధి పేదకబ్బిన ప
గిది నేఁగంటిననె నినజుఁడు॥ ౪

క్షణ మెవఁడు నీయందు మది ని శ్చలముగా నుంచునాని । గ
న మోహ లత సమూలములం దెగు నిను రామరామ యనువారి । వి
నుతించి బ్రహ్మహత్యా శత మణఁగు నిఖిల బ్రహ్మమనిత్రోఁచె నటం
చుఁగొఁగలించెను శ్రీ శేషగిరి పతిని సుగ్రీవుఁడు॥ ౫

౪౦. రేగుప్తి రాగము - ఆదితాళము.

పల్లవి-గరుడగమను సచ్చరిత్రము వినవె - గౌరీ సుకుమారి

అనుపల్లవి-సురుచిరాలింగనమునం బరిహృత - గురుకలుషుఁడై తన
రుసుగ్రీవుని పరమదయాదృష్టి గని చిఱునగవున వదనశశి
శృంగార శ్రీ మీఱ బరతత్వ మెఱిఁగి పలికెఁ వా నను-
ప్రాకృతులెఱుఁగక రఘుకులుడంచు - కరటులను మా
యచేత మోహితులు - గాఁజేతువని పల్కె శ్రీపతి॥ గరుడ॥

లేలెమ్మిక వాలితో ననికిజను కీలుగుఱు తెఱఁగి రిపునుఱింతునని మేలుగ హరిపల్కిన కిష్కింధకు మిహిరతనయుఁడరిగి కురఁచుచు చాలి సింహనాదము చేసిన రిపు శబ్దము విని రోషారుణనేత్రుఁడై వాలి రా నతని యురమినజుఁడరిచె వాలి యమునిబోలె వ్రాలుచు సోలుచు నొకరినొకరేచి చాలప్రొద్దు పోరాడి వాలిచే దూలి రుధిరములు గ్రక్కుచుఁ జని హరితో ననియెగపిరాజు తోడఁబడి॥ ౧

రామా ననుజంపింపఁగ దలఁచితి వో మాయన్న చేనటులైన చోనీవె స్వామి నను ప్రోగోనుమని పొగడిన రాముఁడు కడువగచి నేనుసఖా యేమిసేతు మీరిద్దఱొకరూపమై నొరయుట సేయక తడసితినని సౌమిత్రిగని యిటనికొక గుఱుతిడి యీమాటు బంపుమా యననతఁడనుపమ హేమపుష్పమాలికయొసఁగి పనుప ధామనిధి సుతుఁడరిగి వాలిఁబిలువ నేమిచోద్యమని యాజికతఁడు పో గా మగనితోఁ దార పలికెను॥ ౨

పోవలదు మఱలరా లేవు ఇతఁడు పోరికిఁదిరిగివచ్చునాయనిననగి వాలి నే వీరుఁడనై పోకునికి తగదు వేవేలు వచ్చినను నే వెఱవ వేవేగ నతనిప్రాపుతోడ జావ నడచి వత్తు ననిననంగదు చేవింటి రాముఁడ కవులకు వచ్చి సీతఁ గోల్పడి ఎడరవిజునితోడ తావహ్ని సాక్షిగా మైత్రి

చేసి నేవాలిని జంపుదుమనినాఁడట దేవదేవుఁ డతని శరణమని సుగ్రీ
వుని సచివుఁ జేయుమనె సతి॥ 3

రాముఁడుసాక్షాన్నారాయణుఁడై బ్రహ్మాదిసురలు ప్రార్థించరఘుకుల సోముడయిజనించె రావణవధకు నామహితునకోరులుస్వజనులు ఏమిలేరబల పొమ్మని తమ్ముని నెదరిపోదువఁ దరువుమరుపున నుండి రాముఁడైంద్రిబాణమేయఁబడె సు త్రామసుతుఁడుసోలి గిరి కొన్నమైమెఱుపు కొంతవడికిఁ దెలిసి గుణ ధాము ధృతజటాస్తోము కువలయశ్యాము లక్ష్మణకపీందాభిరాము రాముని౯జూచి వాలిపలికెను॥ గరు॥ ౪

నాచే నీకపకారమేమిదిన నాథసుతుని వలన నుపకార మేమి రాచనడక తెలియక చేసితివి ఈచేతఁ జంపవచ్చునా బోయవై కాచి పొంచి యేసిన కీర్తియేమి క్షత్రియుఁడవై తేని నన్నెదిర్చిచూచిన యశముగు సీతకొఱకు రవి సుతు శరణను టేమిరామస్వామీ నా చెతుపత యెఱుఁగవు రావణు సా న్వయముతో సీతతో నిటకుఁదెత్తుఁదోఁచదా యె దోసమాయె నీకను దుందుభివైరితో నృపుఁడనియె॥ గరు॥ గీ

సకల ధర్మపాలుఁడనై చరింతు శాసింతు విలుకాఁడనై ఖలుల వారక గూఁతురు గోడలు దోడఁబుట్టువు భ్రాతృభార్య పలుకసరియగునకటా నీవెఱుగక తమ్మునిసతి నతిబలాత్కారమునఁ బట్టినపాతకుని నిన్నుఁజంపినపాపముల్ రావనిన వాలిసుగ్రీవ హరికిమొక్కి యికఁ దప్పులు వేచుశ్రీపతినీవు జగ దీశుఁడవని తెలిసెనన శేషగిరి నికేతనుఁడు శరము వెఱుకవాలి య నింద్యముగుకై వల్యమొుందెను॥గరు॥ ౬

౪౧. ఘంటారాగము - ఆదితాళము.

పల్లవి-కోమలారుణ పల్లవ పాణి కోరివినవే శర్వాణి

అనుపల్లవి-భీమ సంగ్రామ హతుఁడైనవాలిఁ జేర్కొని వానరుల్ శోకించిరి కోమలి ఘోరముగా శో గకన్నుల బాష్ప ధారల్లు

భో రున నెలుక తార హారము లు రాల కిష్కింధా పు
రి వెడలి నడుమళుకతార వదనవిజితరాకా తారాపతి నిజప
తిని జేరి వీరాధివీరా ననుబాసి పోయితే రమణ హా హా
యనియడలె॥ కోమ॥ ౧

రామా యేబాణమున నేసితో నానుగని నా బాణమునఁదామ
సింపక నను జంపుమనుచు తరణి సుతుని గని కోపమునస్వామి దయ
నఖిలముగ్గలై నీ కేమిసుఖ మనుభవించు మని భామామణి విలపింప
రాముఁ డామగువ నూరార్పఁ గడఁగెను॥ ౨

ఊరక యేలపొగల శోకమునకు పైరై పోయినతతికి నారీనీపతి
జీవుఁడో యీశరీరమో నీమదికి కోరి గుణ భూతేంద్రియములు చేరికలి
గె మేనది తనువు శరీరినిత్యుఁడ చలుఁడెవ్వరి కీరీతి వగచెదని యనెను
హరి॥ కోమ॥ ౩

అనఘ తనువు దారువు వలెనడరును చి తాత్మ జీవుఁడు నిత్యుం
డని మొనసిపల్కితివీసుఖదుఃఖముల ననుభవించువా రెవ్వరని వనితా
మణియడుగ రాఘవుండు విని యహంకారాద్యనుబంధమె ఘనసంసా
రము జీవునకు సుఖాసుఖములజ్ఞానములనె॥ కోమ॥ ౪

బలు కోర్కెలుగల వానికి రానివి కలలోదోఁచునెటులటులనె
చెలి యనాద్యవిద్యా సంబంధము లేకహంకృతియందునసా తలఁపే
సంసార మదియె బంధము శుద్ధస్ఫటికమున గెంపునిలుప నెఱుపై
నట్లు మతీంద్రియా కలన నాత్మకు సంసృతి యనె॥ కోమ॥ ౫

జీవుఁడు మనోయుతుఁడయి యడిపోవు త్రోవఁ బోవును జన్మ
మృతిభావ మొందుచుఁ బుణ్యవశత నా భక్తుల సంగతిత్రోవదెలిసి
మహాదాదులకు నేమేలొబ్రహ్మమని దలఁచునీవు పూర్వ సుకృతమున
ను సేవించి ధన్యవైతివనె హరి॥ కోమ॥ ౬

నాచేఁ బలుకఁ బడిన యీవిధ మాలోచన చేసి సన్మతివయి యేచి సుఖంపుమన రాముని నుతి యించెఁ దారకయదివినవె ఆచక్రి మహిమ సుగ్రీవుని కానంద ప్రదమయ్యె నతనిఁజూచి వాలికిక్రియల్ సేయ సూచించి పంచె శ్రీరామచంద్రుఁడు॥ కోమ॥ ౭

తరణిజుఁడంగద పురస్సరుఁడయి జప్పరమునవాలి తనువుంచిప రేతోర్వి కేగి దహనాద్యపర కరణీయములొనరించె పరమాహ్లాద మున రామపద సరోజాతములు గాంచి మ్రొక్కిన హరినీరులకెల్లదొ రదినక రాత్మజుఁడు మంత్రి యంగదుండనె॥ కోమ॥ ౮

సిరియు రాజ్యము నీదె నిను సేవించెద నను సుగ్రీవుఁగని హరి యరయనీవె నేను రాజవగుమనియానతీయ లక్ష్మణుఁడుపురిత్వరతోఁ జేరి సుగ్రీవున కలరి పట్టముగట్టి వర్షర్తువున పరఁగ రమ్మనఁజనియె శేషగిరీశుండగు శ్రీరాముని యొద్దికి॥ కోమ॥ ౯

౮౨. యమునరాగము - రూపకము - చాపుతాళము.

పల్లవి-ఫణిశయనునిచరితము విను - దాక్షాయణి భక్తజనప రాయణి॥

అనుపల్లవి-గుణనిధులౌ దాశరథులు ప్రహర్షణాచల శిఖర స్థలివిలసత్ఫలమగుతరు వరవృతమైబహువర్ణ మృగవిహగ సేవితమయి మణి ఘటితమై - వర్షవాతసహమగు నొక గుహనుండిరీ శ్రీనివాసుఁడు నరాకృతిఁ జేకొనినాఁడని - మౌని వరులు సురలు కరమను రాగమునమానిత ఖగ మృగశరీరులయి సేవింతురు - పూని యనుదినమురాముని - యహోరాత్రులుధ్యాన మానసికుఁడయి లక్ష్మణుఁడేకాం - తమున వికసిత ముఖుఁడయి తగురఘుపతినిజేరియో భానునిభాసిచే మునువిన్న బోధ నేమఱచితిఁ గాన సులభమౌ క్రియాసంయోగము సెలవిమ్మనియనె॥ ఫణి॥

చరణములు-ఇనజుఁడ ననుఁబూజించఁగ నంతములే దనిన విను సంక్షేపముగా వినుపింతుగురుదయ ననుపమ మంత్రోపదేశ మేధీమంతుఁడు మొనసి గురునిచేఁ బూజావిధి తెలిసి తగ నను సభక్తికముగా నారాధించి ప్రాత స్స్నానాదికమగు నాహ్నికములొనర్చి శిలాస్థాపనముఁ జేసి కృత సంకల్పుఁడై గంధకుసుమాదుల ననుప్రతిమాదిపూజ సేయగవలె ననె రాముఁడు॥ ఫణి॥ ౧

నా సన్నిధి భక్తి నేమియొసఁగిన నెమ్మ దినె యలరుదు చాలా భక్ష్యభోజ్యచందనావాసోముఖ పూజాద్రవ్యములు దెచ్చి సిద్ధాసనమున దేవుని ఎదుటఁగూర్చుండి లీలాభా సుర బహిరంతర మాతృకా న్యాసంబులు గేశవాదికము మూర్తి పంజరన్యాసంబులు చేసి హృదబ్జ రవి విమలజీవకళా ధ్యాయిశిలాదులకు కలాసిద్ధి చేయవలెననె॥ ఫణి॥ ౨

హృదయూ వరణాది పూజలా గమవిధి నొనరించి యర్ఘ్యపాద్యా చమన మధుపర్కముల ధూపదీపనైవేద్యనీరాజనాది విధితోపచారముల నర్పించ వలెనన్న వదలక షొదలుచు నగ్ని ప్రతిష్ఠాపనంబుచేసి యదస్సూక్త మార్గమున హోమము వేల్చిదహనుఁ దప్తసువర్ణసముగ మణిభూషణుగ విష్ణుపదస్థితునిగా బుధుల్ సదా భావింతురనెను హరి॥ ఫణి॥ 3

బలి పార్షదులకు నిడిన మంత్రజ పముచేసి చెలఁగి విడెమీనృత్యగీతవాద్యము లలరఁగ నాముందర స్వస్తివచనాదులు సలిపి నాప్రసాదము శిరసావహించి హెచ్చి లలి దండమర్పించి కరయుగళి నాపాద జలజంబులు స్పృశించి తలనుంచి మహాసంసృతివలనఁ బ్రోవుమనియు ధ్యానమున జేయునతఁ డిహపరములొందునని శేషగిరి నిలయుఁడను జన్మునకుఁ దెలిపె॥ ఫణి॥ ౪

## ౪౩. పంతువరాళిరాగము - అటతాళము.

పల్లవి-కలికియలరుల ములికి చిలుకల కొలికి వీనులసుధఁ జిలికి కథ వినవే

అనుపల్లవి-చెలఁగి లక్ష్మణ దేవుని దెలిసి ప్రాకృతునివలె మాయ యలవడ హా సీతా యని నిద్రఁజెందఁడాయెను హరి॥కలికి॥

చరణములు-అచట కిష్కింధాపురిలో హనుమంతుఁ డతి నీతి మంతుఁడగ చలేంద్రుఁడగు సుగ్రీవుని చేరి రాజా ప్రచురత ధనరాజ్యమ్ములుగొని రామచంద్రు మహానుభావుని మఱచి నావు ఖగచరపతి సుతుఁడు తెగిన గతి చెడక రాఘవుని జేరుమువిచికిత్సవలదనిన విభుఁడు పిల్లిపింపుమనెఁ గపులను॥ కలికి॥ ౧

అంజనా సుతుఁ డధిపుని యాజ్ఞ వానరుల రాఁబ నిచిన నఖిల దిక్కులుఁ బిక్కటిల్లఁ గని వీరులు మంజుతర గిరినిభ ధీరులుమహియు నాకసము భేదిల్ల వచ్చిరంతఁ గంజదళ నేత్రుఁడయితగు కాకుత్స్థకులుఁ డచలమున మణి పుంజ సాను స్థితుఁడయి పొఱలె సీతా విరహార్తిచే॥ కలికి॥ ౨

జానకి హా చంద్రముఖి ప్రాణములు నీమేన నిలిచినవే నన్ను బాసి యిందాక, చల్లనై మా మానవతి నంటి నీకరముల మఱినన్నుఁ దాకుమీ రాకాసుధాకర ; భాను సముఁడాయెఁ జంద్రుఁడు పరికింపు లక్ష్మణా యిదివఱకే పంకజాక్షి దనుజుచేఁబడి. యెటులౌటయెఱుఁగ ననె రాముఁడు॥ కలికి॥ 3

స్త్రీసక్తుఁడై పాన మదదుష్టులచే రాఁడు సుగ్రీవునిఁ దురింతునని రాఘవుఁడు దోడర ననుఁబంపు తీ వ్రాసి హతునిగఁ జేతునినసుతు నని యనుజుఁడలుగ హరి కడురాయిడి సేయఁదగదో సౌమిత్రి నీవు చనివాలి వలెఁజెడకు మనుమిఁకఁ దడవుఁ జేసినఁ జెడుదన దవ శిఖ కరణి పురికి నతఁడరిగెను॥ కలికి॥ ౪

గుణధ్వనిచేయఁగవిని యంగదుఁడు వచ్చిమ్రొక్కిన వేగమీదో
రకు మారాక దెల్పుమనఁ జని కలఁగి పురివాఁకిట నిదె లక్ష్మణుఁడు క
పిరాజా పరాకా యన సుగ్రీవుఁడు దెలిసి మారుతినీవలుక దీర్చి యా
ఘనుని దెమ్మనఁ జని వలగొని కినుక నతవత్సలానుజా వలదని తోడి
తెచ్చెను॥ కలికి॥ ౫

పతిపనుపఁ దారాంగన చని భయభక్తి వినయ సంభ్రమముల
నతిఁజేసి కుశలమే చాలాకోపమేమి అతిభీతుఁడయి హరివిభుఁడు నన్న
నిచె మిముచేర రాదేవా యని చెయిఁబట్టి సతి యంతిపురికి తోడ్కొ
నిపోయి నతనిఁ గనుగొనిఁ గపిపతి రుమాయుతుఁడయి పాన్పున నుండి
యులికి పడి లేచె వెఱపరి వలె॥ కలికి॥ ౬

మద లోల లోచనుఁడయి మలయు రవిసుతుఁ గని యలిగి రా
మానుజుఁడు పలికె సుగ్రీవా చేసినమేలు పదటఁ గలిపి రుమావధూర
తి పరవశత మఱచియున్నావా కాన వాలిని పదరిప్రాణము గొన్నసి
త ప్రదరమెదు రెదురు చూచుచున్న దనినరాము కార్య మనఘు యి
తఁడు మఱువఁడనెఁ బావని॥ కలికి॥ ౭

వానరుల నిదె చూడు డెబ్బదిరెండు వెల్లువలను గూడుక భా
నుజుఁడు రాఁదలఁచి నాఁడు అని పలికిన పవమానసుతు చతురోక్తుల
గతా మర్షతనున్న రాకొమరు వేడుకొని భానుజుఁడు పూనివందనముఁ
జేసిన వానిఁగౌఁగిట నిడి యూర్మిళాజాని యాసీనుఁడయి సరస పూజ
లు గొనె సఖునిచే॥ కలికి॥ ౮

రామదర్శనలాలసుఁడయి రథమెక్కి లక్ష్మణ కపీంద్రులు రణ
భేరీ మృదంగములు పొరలఁగాఁ గదలి హనూమన్నీలాంగదనలాది భూ
మిరుహ చరణ పతులు గుములుగొని గొల్వఁగాఁజామర సితాతపత్రి
సద్విభవ యుతులయి శేషగిరి ధాముఁడయి రఘుకులాబ్ధి సోముఁడగు
రామవిభుఁ జేరిరి॥ కలికి॥ ౯

## ౨౨. పంతువరాళిరాగము - ఆదితాళము.

పల్లవి-రామాభిరామ గుణధామ రామకథా సుధా మా ధురి సా మాన్యమా॥

అనుపల్లవి-రామునకనతిదూరమే తేరు డిగి వచ్చి సౌమిత్రి రవిసుతు లు చేసిననతులు స్వామి కౌఁగిట నిడియర్ఘ్యపూ జామాన్యు లఁ జేయ హరిపతిహరి వామభాగాసీనుఁడయి రఘురామ నృప యిటుచూడు వచ్చినకామరూపుల నగణితులఁ గవుల జితరిపుల ననెను॥ రా॥

చరణములు-మేరు మందర హిమవత్పారియాత్రాది గిరులఁజే రి యుండెడి వీరులు దేవాంశభవులు భూరిశైలాకారులు రణోద్ధారులు సార కరిబలులు దశశత సహస్రియులు విస్తార వారణ సత్వులు నిస్తు లులు చారుసౌవర్ణ తనులమలశరీరులణిములు వినీలాకారులిదె గర్వలిడి పరువిడి గణగిన పనికి ప్రాణమీయఁ గోరినారింకవీరుమీయాజ్ఞావశుల భిజ్ఞాయను॥ రామా॥ ౧

గొనకొని భల్లూకకోట్లు గొల్వంగఁదగు నీగుణనిధి జాంబవం తుఁడు నితండు పవనతనయుఁడు హనుమంతుండు నలనీల తారపనస గజ గవయ గ వాక్షు గంధమాదన సుషేణ దధిముఖులు కేసరి ప్రము ఖుఁడు వినుమితండు శతబలి దశరథుండీతం డనఘు వాలికొడుకంగ దుఁ డితఁ డనుపమానబలాఢ్యులను పనిగొను మనిన నినతనయు నాలింగ నము చేసి ముదాశ్రులోచనుఁడయి హరి పలికె ఘనుఁడయి॥ రామా॥

ధరణిజ వెదుక వానరులం బంపుము నీ వెఱుఁగనాకార్యసరణి యనిపలికిన దాశరథియానతిఁ ధరణిసుతుఁ డగచరుల హరిదంతముల కనిచె నవనిజ నడి నెలలో నెఱిఁగింపకున్న వారితుత్రింతునని భేరి మొర యించి యంగద జాంబవద్ధనుతహనుమన్నల సుషేణుల శరభమైంద

ద్వివిదుల ననిచె సరస దక్షిణ దిశ కనిలజుని హాఁబిలిచి ముద్రిక సీత
కొసఁగు మని యొసఁగెఁబొసఁగ॥ రామా॥ 3

శ్రీరామునిచే నాశీర్వాదములు గాంచి మారుతి ముఖ్యు లరిగి
రి సరిత్కుంజభూధరదుర్గములిరిగి వింధ్యాటవి నీరువట్టున డస్సి నీరప
క్షులు గుహాద్వారము వెడలి రాఁగాఁగని బిలములోఁగా వారేఁగి సిం
హాసనమున నలి పరని ష్ఠితి నున్న యోగిని గని కోరి మొక్కిన మీా
రెవరనుచుఁ జెలియఁనుగఁగా రామదూతల మన వారిఫలములు గొనఁ
గ సెలవిచ్చె సతి మదిని హెచ్చె॥ రామా॥ 4

ఫలములతృప్తులయి లలనసీవెవరనిన నలవిశ్వకర్మతనయను హే
మయందురు నను తొలుత నాట్యమునఁ ద్రిణయను మెప్పించినఁ గలిత
సద్వస్తునిస్తులమా నీపురమిచ్చె నలినాక్షుఁ డది మొదలీ గతినుందు పొ
దలి యలఘుమతులార యనివారల ననిచి తాఁబోయి శేషాచలనిల
యుఁడగు రఘువరు పదాంబుజ ముల కెరిగి శ్రుతి సూక్తి వదను నుతి
సలిపి చెలి బదరి కాశ్రమముననను గైవల్యమొందెను॥ రామా॥ 5

రగ, గౌరిరాగము - ఆదితాళము.

పల్లవి-ఇందిరా రమణు చరితము విన వే సుందరీమణి

అనుపల్లవి-మందయానమున జని కపులు మాని క్రిందనాసీనులయి
యెటుపోదము ఎందరయుదము సీతననిన వాలి నందనుండ
ను జనకాత్మజను గన్గొనక అందరిగితిమేని ననుజంపు ముం
దుగా రుమాజాని నేనిందు మృతి నొందువాఁడనన నందు
కొందఱింటె యుందమొందుకు మృతి యనిరి॥ ఇంది॥

చరణములు. రామబాణము గనన భేద్యము జగ త్త్రియమునం
దు గలదాచిఱుత యిట్లనుటేమి తెలివివలదా వినుమాచందమును సౌ
మిత్రికన్న నీమిాఁదఁ బ్రేమ చాలగలది కొక రహస్యము రాముఁ డ
సఁగ నారాయణుఁడు సీత శ్రీమహిళలక్ష్మణుఁ డాద శేషుఁడు స్వామిపా

ర్షదులము మనమును వైకుంఠ నివాసులము హరి భూమి భరము మా
న్ప దాశరథియై పుట్టెనని దెలిపె నంగదునకుఁ బావని॥ ఇంది॥ ౧

మనము రామకార్య నిర్వాహకులమయిన శుభము గలుగు
ననిన నందరీ ఘనుని బుద్ధి మెలఁగుటే మేలని చని చని మహేంద్రాచ
ల మెక్కి తరుచరుల్ ఘన మకరకమఠ కర్కట జలూక ఝష తిమి తి
మింగిలాది జలచరా భంగమై తరంగాలింగిత స్వర్గ మనోజ్ఞాంగ వల్లి
యై తనరు వనధిఁ జూచి భీతిల్లి యది మనము దాఁటుటేడ రావణుఁడే
డ ననుచుఁ బ్రాయోపవేశ పరులైరపుడు॥ ఇంది॥ ౨

గిరిగుహ వెలువడి సంపాతి యను ఖగేంద్రుఁడు వానరులఁ గని
పోరిగొందు నిరతముఁదిందుకరులవలె నున్నారని పరువిడి రాదుర్మృతి
భీతిల్లినవారిఁ జేరిహరి జటాయువెంతసుకృతియై మరణ ముందెననువా
రి సంపాతి సహోదరుని మృతి దెలియ విని హరి వరు లచ్చటికి వ
చ్చుటయునెఱిఁగి వారును జలధికిరా నరిగి తమ్మునకుఁ దిలోదకము లిడి
మరలఁ నతని నప్పుడడిగి రగచరులు॥ నింది॥ 3

నగశిఖరమెక్కి నిక్కి లంకలో నశోకవని నవని సుతఁ గంటి ని
ది మొగమాటము గాదని పల్కి సంపాతి తగనిట్లను నాతమ్ముని జంపి
న పగదీర రావణునిఁ ద్రుంతు పక్షయుగము లేకునికి నెగురలేను చి
న్ననాఁడో మహాత్ములార పంతము మీఱఁగ నెగి జటాయువేను ర
విమండలోన్నతం బెగురఁ గాను అరుణగభస్తిదీప్తి ఱెక్కలవిసి పొగర
డఁగి పడితి నతండువడు కెఱుఁగననె॥ నింది॥ ౪

ప్రాణములు మూఁడు దినములకు వచ్చి పరగ శేషశైల వా
సుని దయ నేను దెలివొంది చాలా వగపోముఁడఁ మౌనిఁజేరంజని
మ్రొక్కినఁ గని సంపాతి నీకీవిరూప మేటువచ్చె మేను గృశించుటేమ
నిన జగతిలో మీరెఱుఁగని దేమి సంయమిస్వామి యైనవినుమని మధీ

ర చేష్టిత మంతయుఁ దెలుప విని కడలేని యడలూనియున్న నన్నూ
డించ మునిదలఁచెననేఁగ పులకు ఖగపతి॥ నిండి॥ ౫

౪౬. పూరిరాగము - ఆదితాళము.

పల్లవి-వినవెరామచరిత్రము దాక్షాయణీ॥ వినవె॥

అనుపల్లవి-మునిచంద్రుండా చంద్రముఁడు తనుదెల్పు రీతి సంపాతియ
ని యెఁగపులతో శోకమూల మీతనువు తనుకారణము క
ర్మమనుచు॥

చరణములు-నేను దేహి ననే బుద్ధిచేత పురుషుని కర్మమును ఆ
దివు యవిద్యవల్లనేను కాలిన యినుము వలెఁ దాను మాయా యు
తుండయి వలలోను గుణమయమై యీమేను మేనని భ్రమసి తేను తె
లివి మఱ్ఱను దార సంసార మాయె తానా యవికార దురభిమా
నమునఁ గర్మములు చేసి ఫలాధి కుండగుచుఁ జెడి తిరుగు జీవుండనె॥
వినవె॥ ౧

యాగాదులుచేసి స్వర్గ భోగ మొంది యాఫలము పోఁగాభువి
పయిఁబడనరుండు బాగాచతుర్విధ భోజన సరాగ స్త్రీపురుష సంయో
గమున చేతో మయుండయి వేగమె స్త్రీగర్భములోగాఁ జొచ్చి నెతు
టఁదోగి యొకనాటికలల నడి గట్టియై యైదునాళ్ళగబుగ్గ వలెనై పది
యవ దినము రాఁగమాంస పేశలమానని తెలిపె॥విన॥ ౨

పదియేనహాముల కా మాంసపు పొదినెత్తుట జొత్తిల్లుపిండా
కృతియయి యంకురమిఱువది యైదుదినమ్ములకు ప్పతిల్లు నెల మొద
లు తల మెడ మూఁపు వీఁపు నుదర మివియైమ పొడము కరపద పా
ర్శ్వకటి జా నూరువు లుదుకై యొనరరెన్నెల లాముదిత గర్భిణి కో
ర్కె విదితమూ మూఁడవ నెలను పొదల నంగసంధులఖిలాంగుళము
లుదయమివా నాల్గు నెలల కనిపలికె॥ 3

తెలి గన్నులు ముక్కుఁ జెవులు బలువన్నెల చాలు నఖముల యిదవ నెలఁ గల్గు నాఱవ నెలను గర్ణబిల గుహ గుదములు పొక్కి యొదవు రోమములును బెన్నెఱు లందముగను మొలుచు నాఱు నొక్కటౌ నెలను ఎనిమిదవ నెలను లలితా వయవోజ్వల షూ నఖిలి జ్ఞానియై జీవుండలరి మాతృభుక్త సార మైదవ నెల మొదల్ సచేతనుఁ డయి కొనునని॥ వినవె॥ ౪

నానా యోనుల జన్మించి నేనాలుబిడ్డలకయిహీనవృత్తికిఁ జొచ్చి యునాకుటుంబ భరణమందేనామదినిల్చెఁ గలలో నయినా హరినిదలఁ చ నయితి గాన ననుభవించెద నీసారీ గర్భ నరకము నేను తొలఁగిన మఱచి పోను హరినని శిశువు మేనుకదలి వెడలు మాతృగర్భములో నుంచి పదో నెల హరి దయనని॥ వినవె॥ ౫

తాను బ్రహ్మానందా ద్వయ ఘనతత్వ బోధాత్మగా వినుతా నెఱిఁగిన నజ్ఞాన జనిత మగు మోహ మడంగును గనుక పౌత్రామది నిదిచేకొని తాలిమిఁ జెందు మనె మానియని తాఖగపతివానరులం।గని తద్దయు మ్రొక్క అక్కలను వార వచ్చె శేషాద్రి నివాసునిదలఁచిన గ్రక్కున భవాబ్ధిఖలుఁడైన దాఁటు భక్తులగు మీకీవనధి యెంతని చనె॥ వినవె॥ ౬॥

౪౭. ముఖారిరాగము - ఆదితాళము.

పల్లవి-కోరి శ్రీగారి భవ్యచరిత్రము వినవే॥

అనుపల్లవి-వారినిధి వానరముఖ్యులు చేరి దాఁటు దారి గానక తొరి యొకరొకరి మొగములు సారెకుఁ జూచుకొనుచు దైన్య ము దేరనున్న వనౌకసులఁ గని తారకొమరుండుపలికెనల వేర్పడంగ॥ కోరి॥

చరణములు-కదలియిం దెవ్వఁడు గడచి సీతనుగని రాఁగలవాఁ డు వాఁడే మనకిట ప్రాణబంధుఁడా ఘనుఁడె రక్షకుండు రాఘవ స

్రీవుల కెలమిచెల్ల తడవువలదు మీమీ బలములు నుడువుఁ డనవుడు
మోదమునఁ గపు లుడుగక పది యిరువది దొంబది యోజనముల దను
మేమీజలధి దాఁటఁగ గలమనిన విని జాంబవంతుఁడు యువరాజు
తోఁ బలికె॥ కోరి॥ ౧

మునుత్రివిక్రమదేవునకుము వ్యోమమార్గ్గానరఁ బ్రదక్షిణముల
నొనరించినా నిప్పుడౌదవె వార్థక్యము దాఁటను జాలు శతయోజన
ములు అనిన వాలితనయుఁ డంబుధి దాఁటి చనిన రాఁగలనో రాలేనో
యనెను అసఘ నిను బొమ్మనఁ దగునే యేము బెరసియుండగ నని ఋ
క్షపతి పలికె నంగదుఁ దంతఁ బ్రాయోపవేశము సుఖమవెను॥ కో॥ ౨

బలవంతు హనుమంతుఁ బ్రస్తుతింతా మితఁడు గలుగఁ జింతిల
నేటికి జలధి దాఁటి యాజానకిని జూచి రాఁగలఁ డని డాసి మున్నాటి
కిందెలిసి నిన్నెన్నఁ దరమేమముఁగావవలసి పొమ్మనిలతనయ పవనుఁ
డే చెలఁగి తోడగు నీకనుచు నాశీర్వాదము లెనసిచేసి యలరించి బ్ర
హ్మపుత్రుని గని యాంజనేయుఁడు త్రివిక్రముపలెఁ బ్రబలె॥ కోరి॥ 3

మారుతి బ్రహ్మాండ మగల నార్చి పలికె నీరధి యుత్తరించి ఆ
రావణునిఁ దున్మించి యవనిజఁ దెత్తునో ధీరులార మేలెంచి ఆరాక్షసప
తిఁగట్టి లంకతోనే రాముని సన్నిధికిఁ దెత్తునో త్వరఁగాఁజేరి త్రిజగ
న్మాతయైన సీతను జూచిరానో యనవుడు పౌరుషముమీఁద నగు నవ
నిజఁ బరికించి రమ్మనిరి కపులందఱును॥ కో॥ ౪

తుహినాద్రి సముద్రత్యుత్ఛ్రుత స్వర్ణవర్ణుఁడు మహితారుణాననుఁ
డు అహికులసార్వభౌమాభదీర్ఘవాలుఁ డనుపమ సుయశోవిశాలుఁ
డు అహితాంతకుఁడౌ హనుమంతుఁడొప్పె ।నామహేంద్రాచల మస్త
కమునఁజూడ రహిమీఱ శ్రీమదధ్యాత్మరామాయణమున కిష్కింధా
కాండము బహుళార్థమది తెనుఁగించె సుబ్రహ్మణ్యకవి శేషగిరిపతి
పేర॥ కోరి॥ కిష్కింధా కాండము, సంపూర్ణము, ౫

శ్రీ ర స్తు.

# శ్రీమదధ్యాత్మరామాయణ కీర్తనలు.

## సుందరకాండము.



### ౮౮. సౌరాష్ట్రిరాగము-ఆదితాళము.

పల్లవి-శ్రీరజతాద్రిసదనా వేడుకా శే-షాద్రీశు చరితము వినవిన

అనుపల్లవి-మారుతి సాగరము శతయోజన దూరమొక నిబ్బరమున
దాఁటఁగఁగోరి యానంద కందళితుఁడై శ్రీరామునిభజియిం
చి కపులఁ గాంచి కూరిమి వనచరులారా కనుఁగొనుఁడీ న
న్ను లంకఁజేర భూరి వేగమునఁజనిజానకిఁగని పొసఁగవత్తు
యశముదెత్తు మీకనియెను॥ శ్రీరజ॥

చరణములు-నేను ధన్యుఁడను ధన్యుఁడ హరిపద నీరజములమ
రనుగందునెవ్వఁడయినా మృతి కాలమందు రాముని శ్రీ నామస్మరణ
నొందు భవాంభోనిధిఁ బుడిసిలందు నడఁచి మానితముగఁ బరమ పద
మా ఘనుడు తానొందు శ్రీజానిచేత నతని ముద్రికచేఁ బూఁతి రఘు
పతిని నెమ్మదిలో ధ్యానింతు ననువా నీజలధి దాఁటెద నని హనుమం
తుఁ డరికృతాంతుఁడు పూని బాహువులు విచ్చి మెడపొడవుగ నిక్కిం
చి మీఁదుఁ జూచి మేనువంచి తోఁకఁబెంచి పాదము లూని యెగసె
నానిపొగ రేమిచెప్పుదు॥ శ్రీ॥

పోవుచున్న పవనాత్మజు నలనమ రావళిఁజూడఁ దలంచి సుర
సాదేవికి నుపచేశించి పంచిన పావని నదియెదిరించి పెరిగిన నావీరుత్రె
ట్టించిపగిబలె నావలనది మఱియుబలియ సూక్ష్మతను వైకొంచి యా
దేవి కడుపుఁజొచ్చి వెడలిన నగ ధీరునిగనిమెచ్చిజయమగునని తావ
చ్చుట సతిదెల్పి చనెనతఁ డావల బోవమైనాకగిరిదగ్గిరి రావయ్యా హ
నుమంతానీ రథిపనిచె నాయందునుంత నీవు విశ్రమించి పొమ్మన నిల
క యేస్పృశించినెర్పుమించి పోఁదొడఁగెను॥ శ్రీ॥ ౨

ఎదుటను సింహికయనురాక్షసి ప్లవగేంద్రు మైనీడ మ్రింగితో
నఁ గుదియించె నతఁడెఱింగి తనఘన పదమున దన్నిన గ్రుంగిగెడసెవ
ది గని గరుడుని భంగి నభమున బొదలుచు హరిపతియుదధిదాఁటెను।
బొంగికడుముదమునను సువేలాచల మెక్కియద్భుతమతియై శ్రీలఁ ద
నరి మణిసదనగోపుర ప్రాకారసౌధో జ్జ్వలమౌ దాని లంకారాజధా
ని కుదురు గని మెచ్చు చుండఁగరవిఁ గ్రుంకెఁదన్నెరు లెఱుఁగకుండ
కదిసి వాయుజుఁ డణుమాత్రుఁడయి లంకాపురంబు గోపురంబుఁజేరి
నిలిచె॥ శ్రీరజ॥ 3

లంకిణియను రాక్షసి యనిలజుఁగని లావుమెఱసి పోనీక యోరి
నీకొఱకుసురింతలేక పోయెదు లంకిణినను గయికొక వానరా యింకనై
నఁజెడిపోక యెవఁడవు మంకుతనము మాని కలదూపుచెప్పుమనిఝంకి
నరచేతనదియడచిన సామీరియుభూతతతి బెదరగా బోరికవుపిడికిటదా
నిఁబొడిచిన భువిఁబడి రక్తము గ్రక్కుచుమ్రొక్కుచు రామకింకరనతినీ
పాదములకిదె తాఁజెడు లంకయింకమీఁదఁ । బంకజాసనుని వాక్యమదే
యనుచుఁ బడఁతిరామ కథ విరామమిడక దెలిపె॥ శ్రీ॥ ౪

రావణు నంతఃపురమునఁగ్రీడా । రణ్యమున నున్నది సీత రా
ముని । పాదస్మృతిసంజాత మౌరామెనా కీవఱకు సుకృతముచేత నిను
గంటి । శ్రీవరభక్తవ్రాతాగ్రిణి నీసేవగల్గెనేధన్య నోజను శ్రీసమేత

రాము । భూవిభుఁడు నామది రంజిల్లుగా కేవలనునిమదిని దివి కదిచనె।
నావారిధి నంజనీ సుతుఁడు దాఁటి । నప్పుడురాసుతకు నాదశగ్రీవుస
కు । శ్రీవిలయకారణము లైయదరె । వామ భుజా ఖిలు ధ్రువము లై ।
వే విధముల శుభసూచకమై రఘుక్షితిజోరువక్షమైయదరెను॥ శ్రీ॥

౪౯. కేదారగౌళరాగము-ఆటతాళము.

పల్లవి-నలిన నయనుకథాసుధ నపర్ణాకర్ణాంజలులఁ గ్రోలవే॥
అనుపల్లవి-బలియుఁడగు ననిలతనయుఁ డావల లంకలోఁజొచ్చి। యిలా
సుత విలాస తనువల్లి నెల్లచో నరయుచుఁ దిరిగెఁబురి॥ న॥
చరణములు-రావణునంతిపురమున కేగి జనకభూవరాత్మజనందు
శోధించి విసువక । దేవకిన్నర మరున్నాగ స్త్రీలు చెరనున్నకడనార
సియుందుఁ । బావని త్రిలోకపావని కృప। దేవిగానక లంకిణివాక్యముద
లంచిచనె రమ।ణీయమగునశోకవనమునకు॥ న॥ ౧

రత్నంపుమేటికలలర బాగైనబావులు । రాజిల్లువిరితావులు దే
వతాశాఖ । తతులనతులముగ జతలగు ఖగరు । తముల కలరు- లేడి
పిల్లలకీవులు । అతిమృదుల మధుర ఫలభర న। మ్రావనిజ శాఖా
లం । కృతస్థలుల గని మారుతి తా న।ద్భుతమతివెదకె క్షితిసుత న
చట॥ న॥ ౨

అందమైహృదయూ । నందమై వనలక్ష్మి।చందమై మైత్రిగలసు
కృతి గతి మిన్నంది శతశాతకుంభస్త।భాన్వితంబగు మేడఁగని భూపు
త్రి।అందులేకున్నఁ బోయి మరున్నందనుఁడు తిలకించెముందరశింశుపా
వృక్షము మొదట సీతను లోకమాతను॥ న॥ ౩

దనుజాంగనల మధ్యమున నున్నదాని శ్రీ తరుణినననొప్పుదా
ని దీనతయు జడగ।ట్టినకురులు నుపవాసముల గృ।స్సిన మేను మాసి
నచీర గలదాని । తనుగావపిభుఁడురామికి నెం।త యుసగం గన్గవను జ
ద్రిగాను బాష్పకణముల దాని రామునినుడువు । పడఁతిగనెఁ గపిపతి।అ

వనిజ గంటిఁ గృతార్థుఁడ నైతి రాఘవుపని నాచేతనుసాధింపఁబడెననిభు
వికి దిగుతటి నగరి వెలుపలఁ బుట్టె నొక కలకలమదియుఁ గనినేనురవి
కులుని సతినలరింతునని । పవమానసుతుఁడుండెఁబవళించి రావణుండు
కల రఘుపతి భటునివానరుఁ గనిలేచె॥ వ॥ 3

ఇదిదుస్స్వప్న మనిక్రీడావని దశవదనుఁడు రాఁగాంతశతపద
కటకముల రొదలు నిశిచరపతిఁ గని బలుదిగులు న నడఁగితలవంచు
క చింతాపదమైతనమది శేషగిరిసదనునారాముని గదియించి చిత్తరు
ప్రతిమవలె గదలకిట్లుండెనళికికలికి॥ వ॥ ౫

౫౦. బేగడరాగము-ఝంపాతాళము

పల్లవి-వింటివా నీరేజపాణివాణీవినుతగీర్వాణి భవాని॥

అనుపల్లవి-తుంటవిల్తునిబారి తాఁసురవైరి తుదిదైవమాడింపనై దేహిఁ
జేరి వా । ల్గంటిరో ఇంకమీఁదదయ రాదా లలితమగు నీ
కటాక్షవీక్షణమున నన్నుఁ । గంటివా పట్టంపు రాణిఁజేతు
వరింపుదంటతన మేలనేచాలతాళఁ జాలననేను॥ విం॥

చరణములు-పేదమానవుని రాఘవునినమ్మి యతఁడే దిక్కనిద
లంచెదవుసీ । బోధకేమందు నేమందు విభుఁడెందు । రాఁదలచినాఁడే
మో గాక కపులగుములందు । సాధైనృపుండున్నాఁడనివిన్నా । సత్వ
హీనునభిమాన హీనుని గుణహీను । గారవింపకు నీవు మనుజటివలె
నెంచినావు లే దతనికలవబలననుఁబొందుమనె రావణుఁడు॥ విం॥

దశముఖునిపలుకు విని సీతపలికెఁదృణమంతరున్పగాఁ గొని
కినుకచేత దశర । థ సుతునకళికి । కాదా ఒకబీదతపసినైరక మొఱఁ
గినను దెచ్చుట క్రివ్యాద వస హవిస్సు కుక్కగొనులెక్క । వెసన
నుభవింతువాఫలంబురామబాణ । విశకలాంగుఁడవై లయమొందు త
టిన్నృపాలశశినెఱిఁగెద వుదధి దాఁటివచ్చు పొగరుదంచునని॥ విం॥ ౧

పిసుగులకన్న కడిది। గానుమాటలను। పడఁతి నసి గొని వేఁ్రయంబూను। దుడుకు రక్కసుల దొర। నెదిరి మందోదరి। తొగలేని చెలులు పదు। వేవు రున్నారు మఱి। గడుసరి యిదిమనుజాంగన దనుజా। గ్రిణి దీనిపయిఁ బ్రేమ మాని పోదము రమ్మనుచు ద్విమానముల నాపాం డొల్ల దేనిదీని। యొడలు కావలి వారు తినుఁడని చనియె రావణుఁడు॥

అవనిజను భర్జనముల బెదరించి। రసురాంగనలుబహువిధములు। సవినయము బల్కుండీ। సతికి రఘుపతికి। జయమైరావతము నెక్కి రామలక్ష్మణులిచ్చటికి వచ్చి। తవిలిలంక గాల్చి। కోరిగెల్చి ధరణిజను గొని య। యోధ్యం జేరఁగఁగలగంటి। వివసనుండై తైలమంటుకగుంటగూల। వింశతి భుజుఁడు గంటి నిదితప్పదని త్రిజటపలికె॥ విం॥ ౩

లంకవిభీషణుఁడేలఁ గంటి జానకి రామాంకమున నుండఁగల గంటి నింక భూసుతకువలగొనుఁడీ మేలనుచు। నింతినుడివిమ్రొక్క చెలులు నిద్రించి రలజడి। పంకజాక్షి సీత శ్రమచేత। వడి యెలుంగెత్తి యేడ్చె ఘంటారవంబునం గొంకకీతఱి శేషగిరి రాముఁడభిలాష గొనిరానిదే మనితనుపుత్యజించ నూహించెను॥ విం॥ ౪

౫౧. నాటకురంజి-ఆదితాళము.

పల్లవి-వినురఘువర చరితము పార్వతీ। వినుత మేచకాకృతీ॥

అనుపల్లవి-హనుమంతుఁడు జానకితో భాషింపంగ। ననువౌతఱియిది యని తాఁబలికెను। మనువంశ్యుఁడుదశ రథుఁడను నృపుడిలఁ దనరునాదొర। కునల్వురు తనయులు రామలక్ష్మణ భరత శత్రుఘ్ను। లనువారలు రాముఁడగ్రజుండు। జనకాజ్ఞనడవి కేగి సీతాలక్ష్మణులతోఁ బంచవటినుండ రావణుఁడుసీత। ని నకులులను వంచించి గొని। చనె నెడరిజటాయువు గాంచి। జనపతిఁజూడ నేను సుగ్రీవుచెలిమి। గని వాలినిగీటడంచెన నెమారుతి॥ వి॥

చరణములు- వైదేహి నరయ । నాల్గుదిక్కులకు । వానరులను బంపఁగొందఱ మేము।ఈ దెస వెదకంగ।వచ్చితిమందు నే నీవారిధి దాటిలంకఁజొచ్చితిఁదిల । కింప నాముభాగ్యరమ యున నశోకవని నవ్వశింశుపా।తరువు క్రింద నాతల్లి దేవతామతల్లి తను।నిందితహీరణ్మయవల్లి। వే దర్శించితి సీత యనుమాట । మేదిపే సుతవిని మహాద్భుత ముం దె-నెద॥ వి॥ ౧

మిన్ను మోత్రియో పవనుని పలుకో కన్నకలయో నేను రామకథ । యెన్నాళ్ళకువింటి గర్ణామృతముగ । నెన్నఁడునిద్రలేదు కలగాదు సత్యమై తేను । కన్నులయెదుటపరిసన్నుఁడౌఁగాకని కనమార్గినుడగి వచ్చిసీతకు మ్రొక్కి పిన్నపిచ్చుకంతిటినాఁడై । వినుతారుణముఖుండై యచటివా । రెన్న నంజనీసుతుఁడు శేమాచ । లేసుండెసరామునిదూత నే ననెను॥ ౨

౫౨. శహాన-త్రిపుటతాళము.

పల్లవి-వినవెయూననజితచంద్రబింబహేరంబ జనని వర సద్గుణాని కురుంబ॥

అనుపల్లవి-జనకసుత చిఱుతతనొందిన హనుమంతుని రావణుని మాయల బలుకిక యుండె॥ విన॥

చరణములు-తల్లి నేమాయికుఁడగా నానంద వల్లి గుణముల పాలవెల్లి నాయందరమరలు మానుమింకను వింత సేయఁ జెల్లునా కోసలపురిధాముఁడై తగు శ్రీరామదాసెల్లిసుఁడను మారుతసుతుండ నల్ల సుగ్రీవుని మంత్రిని నేను కల్లగాదంచు నాంజలి యొనరించు కపిఁజూచి నా వారలకెట్లు పొందగు ననె సీత॥ విన॥ ౧

మాయమ్మా రావణుండు నిన్ గొనిచనిన చాయ వెదకుచు। నృపుఁడె బోయ చెలిచే నీ తెఱఁగువిని నీ కడన్వసింప రాయబారమం పెనను సుగ్రీవుఁ డచటికి బ్రహ్మచారినై చనివారల యభిప్రాయమెఱిఁగి

తాకోమరులఁ దెచ్చితి అంతనరవానరేంద్రులకు చెలిమి ఖలుఁడౌ వాలి ని రాఘవుఁడుచంపెనని సంజనీ సుతుఁడు॥ వి॥ ౨

మాత నిన్నారయఁగననుఁబంచినీచేతనన్నియునగును వాతాత్మజ మనలక్ష్మణుల మేలువార్తసేమముఁ దెల్పి సీతా సతికిమ్ము ముద్దుటుంగర మని హరి యొసఁగెఁ జేకొను ప్రియత్నమునఁ దెచ్చితి నృపతి చేతి ముద్రిక యనిసీత కతఁడిచ్చెను ప్రీతిచేఁగొని శేషాచలేశుఁడౌ రామవిభునామాంగుళీయకమాఁదలదాల్చెను సీత॥ విన వే॥ 3

౫3. యదుకులకాంభోజి - అటతాళము.

పల్లవి-రామదాసుఁడవౌనీవు హనుమంతా రావయ్యాయిలకంతా

అనుపల్లవి-క్షేమమా సూర్యవంశాంబుధిపూర్ణ సోముఁడైన శ్రీరాముఁడు ఆలక్ష్మణుఁడు॥ రామ॥

చరణములు-ప్రాణదాతవు జగత్ప్రాణ కుమారా భూనుత విహారసపుణ్యవిచార మానిత కల్యాణ క్షోణీధరా కార మహితానందసారా కంటివానాయిడుమలు భూమినాథునికిదయరా నామనవి పవమానాత్మజదెలుపు ఆనాఁడు నేనాడిన మాట కలుగ వలదను మఱంది తో భాను సన్నిభుని తోఁదెలుపుము పరమధార్మికధారుణి విలసిల్లుము॥ రామ॥ ౧

గడువు రెన్నెలలదాఁకా హరిరాకున్న చెడుగురాక్షసులుభక్షింతురునన్నా రడిసేయు రావణుని మథియించి జయముగొన్న కడుకీర్తియనవన్న పతితోఁ దడవు వలదని నుడువు కరి తుంగ మడువుఁజొచ్చిన వడువుననులంక వడిజొచ్చి దానవువ్రచ్చి యవార్యత ఖగేంద్రుఁడమృతముఁగొను గడఁక రాముఁడు నన్నుఁ గొని చనఁ గాఁ బ్రియత్నమును యత్నముగఁజేయ॥ రామ॥ ౨

నాచే నీయునికివిన్న పుడే సానుజుఁడయి రామాలి వచ్చి రావణుఁ దునిమిచిఘనుఁడయి యేచి యయోధ్యకు నిదెసిన్నుఁగొనిచను నిం

దారిది సురసుతుఁడయి అన నోబాలక నీవెట్లాదాఁటె దవబ్ధి కీవార్ధి వారలెట్లాదాఁటు దురనిన ఓచంద్రముఖీరాఘవులనా మూఁపున వహించిదెత్తునిటకు నాచేతి కానవాలిమ్మన ననువడనమ్మినెమ్మిఁజూడామణియొసంగె॥ రామ॥ 3

శ్రీరాముండొకనాఁడు చిత్రకూటగిరికోరినాతొడలపయి గుక్కియున్నతఱి మీారియొకకాకియా మిషమనినాకాలిబొటనవ్రేలు జింపెను. డగ్గరినిద్రదీరి మారీచ వైరి కాకిపై పూరి మంత్రించి కేరియేయశరమై గారింప ముజ్జగము దిరిగి కావుమని రాముని వేడఁగ న్నీరు నీరసము గాదనక న్నిచ్చి చనెనని యెఱుకసేయుము పతికి॥ రామ॥ ర

చిఱుతవీరక్కసు చిక్కులఁబడక జరుగనెట్లగుననిన జననినానడక యెఱుఁగవు మిన్నంది పెరిగెద భయముండక వీక్షింపుమని కడకతెలియ హరివీరుండు దాల్చె నరివీర భయంకర విగ్రహము శ్రీహరివిష్ణుంఖు త్రివిక్రమ శరీరమును ధరించుతెఱంగున ధరణీధరరాభ మగు సీతను వరయ నాతరమె శేషాద్రి శ్వరుని రఘువరునిఁ జేరఁగజను మింకను॥ రామ॥ ౫

౫ర. సారంగరాగము - ఆదితాళము.

పల్లవి-రఘుప్రవరుచరితము - రాజముఖీ సఖి వినవే॥

అనుపల్లవి-అఘుప్రహారి యాహానుమంతుఁ డవనిజాతకు నమస్కరించి వన విఘట్టనమునకు గానికాదు సుర విపక్షుని సమక్షమనుచుఁదలఁచె॥ రఘు॥

చరణములు-ఫలములు డుల్చి విరుల్రాల్చి తరుపంక్తులు పడఁగూల్చి యళి కులము జోపి పెరలురేపి వాపి కూపజలములయడుసుపై కిరానల చిత్తరువు మేడమరుత్తనయుఁ డాగ్రహమునఁదన్ని నేలఁగలిపిఁగలచె కెలనివారు రావణుని కెఱిఁగింపఁ గెరలి లక్ష రాక్షసభటులఁబనిచె॥ రఘు॥

దండి మగలుమిగిలి రాఁ గని గుండె లగల నార్చిగదా దండము
గొని ఖండించెన గచరా ఖండలుఁ డదివిని యమరారి పేర్చి మండిపడి
పంపసేనాధిపతులఁ జండకోప కాండ చాపధరులై దండనాథులె
దురు రాఁ గపి జముని దండ కనిచె విని రావణుం డులికె॥ రఘు॥ ౨

దశముఖుఁడు సప్త మంత్రి కుమారులఁ దగు వీరులఁ బంపవా
రసమ శూల భిండివాల కరవా లాది సాధనముల ననిలజు నెంప నస
మాన బలాఢ్యుఁడై ఏద్వారను గసిమసంగి తోరణ స్తంభమున వెస
నుండెనంత శేషులవలన విని రాాసురేంద్రుఁ డక్షకుమారు ననిచె॥
రఘు॥ 3

కరులు హరులు నరదములు భటు లసంఖ్యాకము లేతేరబంధు
ర కృపాణతనుత్రాణ సబాణ తూణ ధనుర్ధరుఁడై యేపుమీఱఁగ నరి
దివీరుఁడన నేఁగి యక్షుఁడు శరముల నెంపఁమారుతి యలిగిముద్గరము
చే వ్రేసి యతనిఁజంపి సైన్యము ద్రుంచెరావణుఁ డదియు వినె॥రఘు॥

కనుల నశ్రు కణములు నెలుఁగున గద్గదిక యడరగానురా వ
ణుఁడింద్రజిత్తు గని గజిబిజిగా వానరుఁడొకఁ డింత చేసితేనుకనిసహిం
తు టెట్లు వానిఁజంపెద ననిన దేవనీవుపోవ నేటికి వనచరుఁ బట్టి తె
త్తునిచటి కని చనియె మేఘనాదుఁడు సేనలతో॥ రఘు॥ ౫

వాలు బలుక గదవిల్ తూపువజ్రలజోదు దాల్చు ర త్నాల
సొరు దేరు తేరు ధీరో న్నతి నెక్కిచని శ్రీమీఱఁగ వాలమ్ముల్లైదెల
మి నాజునొకటి ఫాల హృదయి పదవాలమున నసురగీలింపఁగనలి గ
రుడుఁడన నెగసి కీశవిభుఁడు గూల్చె రథరథ్యకుల॥ రఘు॥ ౬

ఎంతవాఁడు వీఁడనివేటొక తే రెక్కి బ్రహ్మాస్త్రముదనుజ -
కాంతుఁడేసి యుంతడాసి యతిధీ మంతు హనుమంతు బంధించె క్షణ
ము సంతతమెవనిఁబేర్కొని సజ్జను లజ్ఞానకర్మబంధము లూడిముక్తి

గాంతు రట్టి శేషగిరీశుఁ డగురాఘవ దాసునికి తర బాధము లెంత॥
రఘు॥ ౭

౧౧. గుమ్మకాంభోజి - అటతాళము.

పల్లవి-నారీమణి వినవే యీకథా సరణి॥ నారీ॥

అనుపల్లవి-ఆ రాక్షసేశ్వరు పట్టి పట్టి దేరగట్టఁబడి వచ్చువాని య-ధీ
రాత్మువలెఁ బురము గనువాని వీరహనుమంతు గుర్తించు
వారులు చేరి రా బ్రహ్మాస్త్ర మొకక్షణము తనునవంటి
నదనుట వీరుఁడెఱిఁగియుఁ గార్యగౌరవముచేనూరకచనియె
పేరోలగమున నున్న తనువిభు నెదుట రావణి యిడె
నతని॥ నారీ॥

చరణములు-పూను బ్రహ్మాస్త్రమున కట్టువడెవీఁడు మానుఁబు
విఱిచె వీనిచే దనుజులెగారాకుగాలి చే నెఱులుగతి బడిర నేకులు శా
స్త్రి వీనికెయ్యదియో వివేకులు చెప్పిన దానిఁ జేయుఁపు ముల్లోకులు
మెచ్చఁ గా నీవనిన సుతుమాట లంకా జాని వినిప్రహస్తుఁడనుమం
త్రిల తేనిఁ జూచి పలికె వీఁడెవ్వఁడో తానిచ్చటికి వచ్చుటేమోకరి
డా కాననము బెఱుకుటేమోసుభటులఁ జంపుటేమో వానరుని యడు
గుమన నతఁడటుల నె యడిగి వనచర నేను విడిపింతు నిన్ను భయము
మాని నిజమాడు సభలో ననె॥ నారీ॥ ౧

రావణా లోకత్రియవిద్రావణ విన రోరి సకల జీవహృదయస్థుఁ
డైమించి దేవ దేవుఁడౌశ్రీరామశౌరిపాద సేవకుఁడనురా సురారి మా
రా మాంవసీందున్ని నారీమణిని నీవు శునకము హవిస్సుఁగొనుగతి దె
చ్చి నావు ఇట్లాపలరా చెడిపొయ్యేవు ఇఁకనాబుద్ధివింటే బ్రతి కేవు ర
ఘువతి ఋశ్యమూకమున సు గ్రీవుఁడను కపిరాజుతోఁ జెలిమి చేసి
యొకతూఁపున నేవాలిఁజంపి కపులకుఁబతినిజేసి రవిజుని కపి దేవుఁడన
నిన్నుఁజూడనంపఁ గావచ్చితిని బవనజుఁడన నే కంటిరా తమ్మికంటిసీత

ను సెవింతోఁటవించితి కొంటెచేష్టల కోఁతినాట చంపితి మంటవచ్చిచ
నె నే పూటలన్నిటి కంటె మైప్రియమనఁగా నువినవే వింటెనీకొడు
కు నన్ను సాధించెనంట పొంగి నావు బ్రహ్మాస్త్రము యొంటనంటి
చనె నీకు ప్రియముజెప్పెనంట; బంధునివలె దయచేవచ్చితి కంటక
పుమతి త్యజింపుసుజగము గతి విచారింపుము బంటుగొనమెఱుకయది
ముక్తిదముపౌలస్త్యతతుల నీ వంటివాని కసురత్వము తగు నాయా
త్మగా నెన్నుట నసె నతఁడు॥ నారీ॥

మేనుకంటెను నేనన్యుఁడనని యెంచి తేని పరాపరమైన వస్తు
వౌదువు గానీవరయ బ్రాణమింద్రియ దుఃఖశ్రేణి లేదజ్ఞానమె మూ
లమని దీని దెలిపితే నీకు మేలు కడ లేని దీనిగతి గానుతనువులో నీవు
న్నావంట కేను తను సంసృతి బంధమగు నది మాను చిన్మాత్రుఁడు
నజుఁడు నక్షరుఁడ వును ఆనందస్వభావుఁడ ననరా మేనుప్రాణము మ
నసు మతి మొద లౌనవిభూమిమరుదహమిక ప్రకృతి వికారజాతము
నిల్వొందెననెడు నిరభి మానినిరుపాధికుఁడీశ్వరుఁడు తానని యెఱుంగ
ఘనుఁ డగునని॥ నారీ॥ 3

దశముఖ సావధానమతివై యొకటి వినరాముక్తిదెస నబ్బుహరిభక్తి
వినరామ ననిశిత జ్ఞానముగల్గిమనరాదా నాదాద్యుపాసనమును సోహ
మనరాదా నసమానభవముచేకొనరా ఓరీదశరథాత్మజుఁడు ప్రకృతి
కంటె నుపరుఁడు బిసరుహాక్షుఁడువిష్ణుడు శ్రీదేవి వసుధాపుత్రి యాచె
లి మున్నిడుకొని రత్నసమూహముతో వచ్చియిచ్చి శరణను దెసనీవె
యపరాధినను మతఁడు శరణాగతప్రియుఁ డొసఁగు నభయము శేషగిరి
విభుఁడు అనిపవనసుతుఁడమృత సమానముగఁబల్కు పల్కుల కసు
రేంద్రుఁడలిగినలి రేగెను॥ నారీ॥

గీ. కర్ణాటకసారంగ - ఆదితాళము.

పల్లవి-తరుణీ యీచరిత్రము - సరణి సుజనాదరణీయము॥

అనుపల్లవి-ఇరువదికన్నుల నురోషానల మిరవై ప్రజ్వరిలను రావణుఁడు హరిదాసుఁడగుహనుమంతుఁగనివనచరాధమనినుఁదు్రంతును సీతను వధింతు తరిమిరామలక్ష్మణులనరి మురిఁజంపి కపికులాగ్రణుల తరణిసుతాంగదాదులఁబోరిఁగొందు ధరణియందు యశముగందు ననియెను॥ తరు॥

చరణములు-నూరుకోట్ల రావణకీటములు నాతోసమానమా అసురారినేను శ్రీరామ దూతనై మీఱినాను నా పేరు హనుమంతుఁడాక సారిగుద్ది తే ఓరి నీపని దీఱునీతోసి వారలెంతమాత్రమురా దోసకారి యని మారుతి పోనాడవిని కిన్కకే నారాక్షసచూడానుఁడియాతిక్క దారి కోతి కండలు తెగ వ్రేసిభూతములకు బలిసేయుఁడని సెలవియ్యఁ జేరిచంపఁగడఁగెడు భటుల నివారించి తమయన్నను గని సారభాషణుఁడైన విభీషణుఁడు చారులెందు నవధ్యులౌదు రనెను॥ తరు॥ ౧

వానరుఁజంపుట పాప మదిగాక వారలెవరు దెలుపు వారుచీని చే నింతయువిని రాఁగోరు శ్రీరామ భూనాథునితోఁ బోరు వేవేగ మేనీకుఁజేకూడు నో। దావవేంద్ర పీనికిఁ దగినశాస్తి మీరుసేయుఁ। గానియమింపుఁడన దమ్ముని నుడి తానెద నిడి రావణాసురుఁడు కపుల। ప్రాణపదము తోఁక యదికాల్చి వీని। పోనిండని పల్కదనుజ భటులల్క। నూనక ననిలజుఁ గట్టి బహువస్త్రచయము తోఁకను జుట్టి। నూనెలో నద్ది వహ్ని దరికొల్పి। మానగరమందుఁ ద్రిప్పిరేమందు॥ తరుణీ॥ ౨॥

పావని చిఱుతమే నొందె నంతనె వదలె। బంధముల్ ఘనత నుఁడై తనవెంటవచ్చెడి కావలివారలఁ దు్రంచి యింటింట నిజవాల।

దావాగ్నిఁబెట్టి బూడిద పెంటఁజేసెఁబుర । మా విభీషణునిల్లువినామం
ట తోఁకంటక । పావనుఁడు చల్లనాయె గరువలి చెలి సీతాస్తుతిగంట
గపిపతి । యావనధిలో లాంగూలము ముంచిచల్లార్చె । నేవిభునామ
ము మూలము దెలిసిన జనులు । పాఃకృతైతాపత్రయానలముఁ । బా
యుకు రారఘువరునకు నీ వైశ్వానరుని । చేవగునే తత్క్షణము జని । సీ
తాసతి ప్రదక్షిణము । గావించి మ్రొక్కి రామసన్నిధికి చేవి సెలవి
మ్మనినఁ బదమునెఁగొమ్మా॥ తరు॥ 3

నినుఁజూచి యూరికయుంటిని నేనెట్లు నిచట నిర్వహింతుననిన
కన్నతల్లి మూపునధరింతు రాముతో । నిన్నుఁగూర్చి వినుతిగాంతునని
న మ । రున్నందనుని భక్తిమంతు గని విను । మన్న నేనేవేగనెనాప్రా
ణముల్ ధరింతు నీవా । రాన్నిధి యుంకించియైన బంధించియైన రా
ముఁడు వచ్చి యవనిలోన దశకంఠుఁ జంపి । నన్నుఁజేకొనిన గీర్తిఁ
యందాక । యెన్నకుందుబొమ్మా హరిఁ దోడితెమ్మాయన్న నాఁజనే
యుఁడు చని సువే । లాచల మెక్కి యార్చె నువినిమెన్ని రంగదజాం
బవత్ప్రముఖులు।ఇదివాయుసుతునివిజయనాదమని॥ తరు॥ ౪

తరుచరపతిచరణములూనినతఱి । గిరిసరిత్రికిసరిగాఁ గ్రుంగి ।
యెగురుతఱినుప్పది యోజనముల్ నింగి । కెగరె సాగరము దాఁటి
ఖగరాజు భండినా మహేంద్రధరణీధర మెక్కెను బొంగి । సామీరి
యరసి కౌఁగలించిరియంగదాదులు చెలఁగి పోయినపని నెఱవేరెనా
యనిన మీకృపచేఁగంటి ధరణిజననినసంగతివినిచె హారలనిలజుని కొ
నియాడి నానందమున నా డిరితోఁకముద్దాడిరి పఱచిమధువనమునకుఁ
జనిమధు ఫలములడుగ శేషాద్రి పతికరుణగలుగ ఫలంబుల కేమియని
వ మరుత్సుతుఁడిచ్చె సెలవెలమి హెచ్చి॥ తరు॥ ౫

## ౧౭. నవరోజురాగము - అటతాళము.

పల్లవి-సరిగా రీసచ్చరిత్రము వినువారి కరయ నెవ్వారిలను గారీ॥

అనుపల్లవి-తరుచరుల మధువన పాలకుల నెన్నక తేనెలాని ఫలములు గొనికాపరుల చరణతల తాడితులఁజేసిన వెఱచఱచి దధి ముఖాదులు చని న తరుణిసుతున కెఱిఁగి వనభంగ సరణి దెలిపిన నతఁడెదఁ బొదలె॥ సరిగా॥

చరణములు-చూచివచ్చె హను మంతుఁడు సీతా సుందరీ మణి ని నామధువన మూచెల్వమునఁ జొచ్చిరను రవిజుని మాట హరి వీరు లలర విన నాచెవి కవనిజఁ జేర్కొనినట్లున్న దనిన నానోమహాత్మా యాకార్యముల మెఱసి హనుమ త్ప్రముఖులిదెవచ్చి రనిపిలువ వనేచ రుల నంపఁ జని మిముఁ గంటిమి మేఁతయదయిన రమ్మనె ననిరి॥ సరిగా॥ ౧

మిన్నుముట్టి యాడుచువానరులుమ రున్నందనాంగదుల ప్రాపున రామ సన్నిధిఁ బెన్నిధి గన్నట్లుగని మ్రొక్కి రున్నతి మదిఁబొద ల చెన్నలరఁ గంటి సీతనులోక మాతమీ సేమ మరసెరామ చంద్ర రాజేంద్ర విన్నపమ శోకవని జానకియున్న దిక్కృశించి జడగట్టిన నెన్నె ఱులతో రామారామ యన్ననుడితోడ ననె మారుతి॥ సరిగా॥ ౨

నేనుశింశుపా తరుశాఖలనుండి నీకథఘటించిన విశ్వభూపుత్రి వీనుల కమృతసమానముగాఁ బల్క వీఁడెవ్వండనియెంచిన మానవతీమ ణి ఎదుట వానరశిశువనై నిలిచి మ్రొక్కి నమ్మిక బుట్టునట్టుగా పూని యాద్యంతములు తేట గా నెఱుఁగఁ జెప్పి ముద్రికవిభుం డానవాలంపి రని యొసఁగిన నందిమిన్నందెననెఁ బావని॥ సరిగా॥ 3

నను నమ్మి నెమ్మి మాయమ్మ పల్కె రా ముని కెట్లు నామీఁ ద దయారసము జనియించు నట్లువిన్నవించు నాయిడుమలు గనినవా

డవుగావా అనిన రాఘవుఁడు నిన్నెడఁబాసిన మొదలు హాసీతాయని శోకించుచున్నాఁడు నేఁ జనినీ యునికిఁదెల్పెదనృపుఁడను జార్కసుత యుతుఁడై కపులఁ దోడ్కొనివచ్చి యరివర్గిచ్చినినుఁ జే కొను నంటి న నెనంజనీసుతుఁడు॥ సరిగా॥ ౪

ఆనతీవమ్మరాముని వద్దికన నభిజ్ఞానార్థముగఁ జూడారత్న మొసఁగి ఆనాఁడుకాకముమదమడంచుట దెల్పుమనె సామి నీతోడ నేను నామఱఁది లక్ష్మణుని దుర్భాష లజ్ఞానమునననంటినది శమింపు మని ఆనెలఁత కన్నీరు మున్నీ రన నించ నూఱడించి ఘనోద్యాన మగలించి యక్షముఖ దనుజుల వధించితినని నత డు॥ సరిగా॥ ౬

కొంకక రావణుఁగాంచి భాషించి లంకాపురి గాల్చి సీతాజ్ఞచే బొంకముగావచ్చితి రామ నీపాదం బుజముతో దలఁదాల్చి కింకరుఁడ దయఁజూడు మనివాయుజుఁడు పల్కన రాఘవేంద్రుఁ డానంద సాంద్రుండై పంకజ భవాదుల కశక్యము పవనసుత నీకేతగు నీపని కింకొకటి సాటిగాదని గదియించెఁ గౌఁగిట రాముఁడనిలజు॥ సరిగా॥ ౭

పరమాత్ముఁడనౌ నా పరిరంభణము దుర్లభము వినుసామీరి యనె నెవ్వని చరణాబ్జ యుగళ తులసీదళమ్ములఁ బూజ సలిపిన శ్రీమీఱు పరమపదమం దు దురారాముని చే నాలింగితుఁ డయ్యెహాను మంతుఁ డేమందు గరిమ నధ్యాత్మరామాయణ కావ్యమున సుందర కాండమిది యరసి తెనుఁగించె సుబ్రహ్మణ్యకవి శేషగిరీశుపేర॥ సరిగా॥

శ్రీమదధ్యాత్మరామాయణ కీర్తనలు - సుందరకాండము.

సంపూర్ణము.





శ్రీవేఙ్కటేశాయనమః

# శ్రీమదధ్యాత్మరామాయణ కీర్తనలు.

## యుద్ధకాండము.

౫౮. భైరవిరాగము - ఆదితాళము.

పల్లవి-శ్రీరాజరాజేశ్వరీ యాచరిత్రమార్య నుతి పాత్రము॥

అనుపల్లవి-చేరిదాశరథిమోదము మది మీఱమనోరథుఁడై పలికె
మారుతి చేసిన పని దేవతలచే దీరదొరల తరమె సాగర
మె వ్వారుదాఁటువార లల లంక యె వ్వారికిఁ గాల్చరాఁ దీ
ఱు సామీరి వలననేను రఘుకులము సౌమిత్రియు రవిసు
తుఁడును బ్రదుకఁగలిగె ననె॥ శ్రీరా॥

చరణములు-ఈసుగ్రీవునిభాగ్య మహిమ నుతియింపఁ దరము గాదు కడలిన క్రిమీనహితిమిపాఠీనములకు పాదు ఇదిదాఁట నేసరణి సౌనిక మీఁదు రావణాసురుగెల్చి యెట్లా సీతఁ జేకొన నగు నిదేటి వాదు మోసమాయె బలా యనిన రామునిం గని కపికులాగ్రణిపలికె నా సముద్ర మెంత రావణుఁడెంత యేమిటికి చింత గెలుపువింత నీసరి లేరవని విల్లుఁగొని నిల్వనిన్నదుక నెవరి వశము వే సంద్రముఁదాట నూహింపు రఘు వీర రావణునినిమృతుఁగ దలంపుమనె॥ శ్రీరా॥ ౧

వానరవరులు కామరూపులైన రావణసములగుట చూడు నీ పనికై యగ్నినైనఁ జొరలనున్నారు నేడని భక్తిమానుషము లేర్పడఁ గన్నుఁడు సూనువాక్యముల కలరి యంజనీ సుతుఁ గని పుడమితేఁడు స్నే

నీచే లంకారూపంబు విని దానిపొంక మిఁకననఁతుఁన నవిధూమతమది వ్య తేజోఽధికమై లంకాపురి త్రికూటగిరిపై నున్నదియొనపై దానిచు ట్టు వారాంనిధియగ డ్తయగు కోటమఁశిహిరణ్మయము పూనిధర్మార్థ కామమోక్షములు నానలవు చతుర్ద్వారములననే యతఁడు॥ శ్రీరా॥ ౨

తరుఁశిశశాంకుల పైవిరోధమున దమవారల కన్న మున్నెఅనె నన్న కరణి గోపురములు మిన్నావరింపగను ప్పరిగెలు గృహములక న్న మేల్ చిత్తరువుకూటముల మఁశికవాటముల దనరుసు ప్రసన్న స రసోద్యానముల నడబావుల చలువచప్పరముల నలవిఫణి సరణుల సు రలరయుదురనె నతఁడు॥ శ్రీరా॥ 3

రాజసింహ మిట్లున్న రావణుబల రాజినాల్గవపాలు హతమయ్యె నా చే జేజేరామ పదివేలు ప్రణతుల్ నేఁజేసె దనన్నేలుబంటు గాజ య శ్రీరమణ యనిన హరిహ నుమంతునిమేలు పూజవాక్సుమములఁ జేసి తపన పుత్రుగని సైన్యములనడిపింపుమి దే జయ ముహూర్తమని రాముఁడాన తియ్యఁబ్రియాణభేరి వేయించెశౌరి అజతనయుఁడనిలా త్మజునెక్కె నంగదుఁడువహించె లక్ష్మణుని ఆజికగచ రేంద్రపాలితకపిబ లాలి యిలయీనుగతి నడచె దక్షిణము॥ శ్రీరా॥ ౪

తరుచరు లెగరుచు బరువులిడుచు రుచి కరములయిన పండ్లు దిని తేనెలాని గిరులెత్తుచుఁబుట్లచెండ్లు నానె గరవైచుచు గొప్పగుండ్లు దాఁటుచు హరి! మేమేదశాస్యుఁ ద్రుంతుమేగెద మరమరేలన, జేం డ్లు మఱిరేబగలనకవింధ్య సహ్యా మలయాద్రులు ఘనకాననములును ఉరువడిదాఁటి కర్ణాటక కమఠమ కర ఝుషోగ్రభంగరంగత్తరంగా కరమై భీకరమైన రత్నాకరముఁ జేరి యాదొరమైత్రిఁగని మురువుగ ని టసేనవిడియ నియమంపు మనిరిస్వామి మహాప్రసాద మనెను॥ శ్రీరా॥

ఆవేళ సీతను దలఁచి రాముఁడా హా యని విరహార్తి నేమందు నావిభుఁడు సత్యజ్ఞానస్ఫూర్తి ప్రజ్ఞానఘన కేవలానంద మూర్తి యో

గశోవిదభావానువర్తి కీర్తి దేవతాచక్రవర్తి శ్రీవిభునెఱిగిన దుఃఖా దులు చెందనేరరీఘనునెనయునే? జీవాభిమానికే దుఃఖజాలము చి దూప్రమాపరమాత్మకులేదు మా భావమున కేశోకాదులు నీదెసఁ బోవఁగలవె యెఱుకెకానిలిచెఁ గావున శేషాద్రిపతి రాముఁడుస కల సాక్షియనితలఁపనయ్యొబుధులచే॥ శ్రీ॥రా॥ ౬

౫౯. శంకరాభరణము - ఆదితాళము.

పల్లవి-వినవే మదవతీ సతీ వినుదయాదాక్షిణ్య లసన్మతీ॥

అనుపల్లవి-హనుమంతునిచే నైనసాహసము గనిసిగ్గునఁదలవంచి రావ ణుండు చనదు సురలచే నేనిటుసేయ నని మంత్రులఁబిలు వనంపిపలికె॥

చరణములు-హితులారా కదనవిజిత విమతులారా ప్రభంజన సుతుండు చేసిన పని గంటిరే శూరతమీఱ కొతుకకలంకఁబ్రవేశించి భూ సుతఁగాంచి యశోకదులఁబొలియించి వితతమగులంకఁ గాల్చిగెల్చి చనె వెరవేమిఁజెప్పుఁడనె దనుజపతి॥ విన॥ ౧

ఓదేవా గానముదిత మహాదేవా వలదు నీ తాద్వైతువలని భ యము; జగత్త్రయజయప్రభావా ఆదేవేంద్రుఁ జెఱనిడె నీకొడు కల కాపతి యుళికి పుష్పకమొసఁగె నాదరింపవు వరుణుని, యమునికి భ యమునొందవిదెంత నిరి హితులు॥ విన॥ ౨

మయుఁడు బాలామణి నీకొసఁగి నయముచాలాగాంచె నీదయ హనుమంతుఁడిటుచేసెనని దనుజలోకపాలా మయమునఁ బడనేల కోఁ తియనియే మతి యుంటిమతఁడందున బ్రదికిచనె నియమింపుమోర్తు మిఁక మర్త్యగర్వ నిర్వాపణఁగావింతుమనిరి॥ విన॥ ౩

నిదురదేరి కుంభకర్ణుఁడు నగరుఁజేరి కుంభకర్ణుఁడు చదురుఁజేరి యీమాట యుదుటఁగాంచి రావణుఁదిలకించి యో దోసకారి పదరి

యేమనిఁజేసితివి దీన ఫలమేమినీకిదె చేటుకాలము చిదచిదాత్మకుఁడు
రాముఁడు శ్రీహరి సీతాసతి శ్రీదేవి యనెను॥ విన॥ ౪

రామసౌమిత్రులఁగపుల సంగ్రామభూమిఁబొరిగొందు సామి
నేఁగల్గనీమదికి విచారమేమీ శేముషీజితాబ్జజ యని యింద్రి జిత్తువ
ల్క. నత్తఱిని భాగవత గ్రామణి విభీషణుఁడు శేషాచల కాంతాంఘ్రు
లెదనిడి సభకు చనె॥ వినవె॥

౬౦. కల్యాణిరాగము - జంపెతాళము.

పల్లవి-కాళీ వినుసుజ్ఞాన జనమానస కాసార కేళీ విహారమరాళీ॥
అనుపల్లవి-మేలుఁగోరిసురారి కోమలాంఘ్రులకుఁ గేలు గదియించి వి
భీషణుఁడన్నమన్ననఁ జాలఁజెందిసభికులదిలకించి దనుజేశ్వ
రుని కామాతురునిగాంచి పలికె శ్రీ॥ కా॥

చరణములు-రావణా యీకుంభకర్ణుఁడు నీయింద్రజిత్తు మహో
దర మహాపార్శ్వులు దేవా యీకుంభ నికుంభాతికాయు లీ దేవాంత
కనరాంతకులు మొదలౌవీరులు నిన్ను గావలే రా రఘుకులేశ్వరుని
బారి నీవుపడు వేళనిను సీతయఁగుబల్ కాలముఁగావ్రగొన్నదివెర వెన్నమ
ఱిలేదు సీత నీవలె త్వరఁబోవలె హరిశరణన॥ కాళి॥ ౧

ఇనకులాగ్రణిబాణముల్ లంకాపురిఁ ఘనంబుగ నిండి రాక్షసు
లప్రాణముల్ గొనక మున్నెజాన కినిరాఘవున కొసంగదగు కులగో
త్రాకారులు నఖదంష్ట్రాయుధులు వనచరులు నిరుపమబలుల్ లంకఁ
జొచ్చి వారకగలంచకయును రామునకుసతిని మ్మనఘ నీవుబ్రదుక లే
వు హరసురేంద్రాదు లాదరించినను నినుహరించు రాముఁడనె॥ కాళి॥

రాముఁడె నీపాలిమృత్యువు పాతాళలోకమున కేగినఁబోవచ్చు
నా యేమందు నిన్ననసతమ్మునిని హితోక్తుల హితమాయెనన్న కౌషధ
ముల్ రోగిమెచ్చునా యామినీచరగ్రామణి విధివశుండైె యామెఁయి

యీవిభీషణునిగని యొూరిసేనొసఁగు కామితార్థములను సమర్థతనొంది
బొగరునఁ గాఱులాడుచు వైరులఁబొగడఁదగునే॥ కాళి॥ 3

కలిగినాఁడువిభీషణుం డనుశత్రుఁడు ఖలుఁడు కృతఘ్నుండితని
తోఁజెలిమి దలంప గూడునాఁదాయాది చెడగోరునను నాపలుకు నిజ
మాయెనేరుఁ డిటుబలికినఁ బలిమిఁ దల తెగవ్రేతును బగదీర నసుర
కులాధమానిను గాల్పనెయని దశముఖుఁడు బలుకవినిరోషమున విభీ
షణుఁడు నల్వురమం త్రులునుదానెగసెను గదాయతభుజుఁడై॥ కాళి॥

గగనమార్గమునందు నిల్చివిభీషణుఁడు గంభీరముగఁ బల్కెను
రావణా అగడుఁజెంది చెడిపోకు ప్రియవాదినై హితము నాచరించున
ను దిరస్కరించితిపట్టైనా తగినమన్నన కెన్ని మత్పితృసముండవు దశ
రథతనూజుఁడై యవతరించెఁగాలుఁడు జగతిరామరూపమై మహిజాత
సీతయనఁగ జనించెను జనకునిఃట నని నతండు॥ కాళి॥ ౫

ధరణీభారముమాన్ప సీతారాములు దలఁచిరి విధిప్రేరితుఁడవై
నేఁ గఱపిన హితవాక్యములు విన వైతివిప్రకృతి కరయసాక్షిభూతము
లవెలిలోను తానెచేరియునా నారూపనామభేదముల భిన్నునివలెఁదరు
వులందనలుఁ డొకఁడైన కరణిరాగ వస్తుయోగమునరక్తస్ఫటికమను
నట్లాహరి గుణాకరుండగునని॥ కాళి॥ ౬

కాలమవ్యక్తము ప్రధానపురుషులన గనాల్గుప్రధాన పురుషు
లచే జగము లిలఁదనరు భగవంతుఁడు రాముఁడై సంహరించునిన్నునీ
వారితోనిదినిజమ్ము కాళిసేఁజని హరికినేమమున మ్రొక్కి శ్రీలలర
నుందునని విభీషణుఁడు వారల బోలిమాలిన భ్రమలందోలి శేషాద్రి
పతియ శ్రీవిశాలుని సేవజేయ నపుడెచనె॥ కాళి॥ ౭

౬౧. సావేరి - అటతాళం.

పల్లవి-కామలీలాకార్ముక విజయభూప్రలతా ఖలపావనసుపవిత్రా
హిమశైలసుతావినవే॥

అనుపల్లవి-ధీమంతుఁడగువిభీషణుండు నల్వురు మంత్రులతో వచ్చిద్వి
విని నిల్చి రాముని శ్రీమహితనాముని పాద నీరేజాతములు
చూచి నతుఁడై రామా రాజీవలోచన నా సామీ వినుమని
పలికె ఘనముగ నను జెవులపండువుగ॥ రామ॥

చరణములు-నేవిభీషణుఁడ సతినిమ్మిచ్చిలినట్టి రావణునితమ్ముఁ
డను రామా అన్న చే విడువబడితిగుణ ధామా యింక నీవేగతి ఘన
శ్యామా సీతాదేవి రామునికిమ్మని దశముఖునితో దెలిపినజంపవచ్చెను
రణభీమా అదేవారికి వెఱచి నేవచ్చితి నేని సేవార్థము దేవ దేవదీనులకు
నీవే దిక్కనిననువిని సుగ్రీవుఁడితనినమ్మకుముమా యావిపగతుని య
నుజుఁడుబలియుఁ డనఘ సెలవీదు మంత్రి సచివులతోననియె రఘు
పతితో॥ రామ॥ ౧

ఇనకులమణిరవిజునిమాట వినినవ్వి యనెనేఁదలఁచినమాత్రము
నజగము లనుజగత్పతుల నిమిషమునఁదుంతు జననమొందింతు వేగ
మునం దెమ్మా దనుజుని సకలభూత అభయ దానకంకణముగట్టితి నే
లోకమున ననినజన నాయకుఁబోగడి దిననాథాత్మజుండో యననావిభీ
షణనా మునిదెచ్చి కనుపింపం గనిమ్రొక్కి రాముని ఘనశ్యాముని వి
శాలాక్షుని మనోజ్ఞముఖాబ్జునిధనుశ్శర మహితకరుఁ బ్రశాంతుని లక్ష్మ
ణాన్వితుఁబొగడ దొడంగెవిను॥ రామ॥ ౨

శ్రీరామ రాజలలామ మ్రొక్కెదనీకు సీతాహృదయాభిరామా
ధనుర్ధారిపూరిత భక్తకామా శాంతా రారా యనంతశ్రీధామానమ
స్కారము సుగ్రీవమిత్ర జేజేనీకం జలిరఘువరసార్వభౌమా జగముఁ
కోరి పుట్టింపఁజేరి రక్షింపనోలి శిక్షింపనీరీతులకాది కారంబగు నీకు
నతి త్రిజ గద్గురుండవై తగు నీకు జో హారులాదిగృహస్థవగునీ కమిత
సాష్టాంగములు చేతుహరి నుతవాగ్ఘరీ యనెవిను॥ రామ॥ 3

చరాచరభూతములు చేచెలఁగి వ్యాపక స్వరూపమున వసించి యుండు ఱెఱుఁగరజ్ఞులు మాయనుంచి యెఱుకమఱచి జన్మమృతులు గాంచి యెపుడు తిరుగుచుందురు శరణాగతులఁ బ్రోవవే దేవ దయారసము నించి సుజననానా దరణీయముగాదు ధరణీధరలోక సరణి శుక్తిరజతముకరణి భ్రమయని యరయు తజ్జులుపుత్రదారగృహాదులం దాస సేయరు విష యరతులగుసురు తుదనరయనివిశోక కరములగను జనుఁడివిగనుఁగొనువరదాపాలితద్విరదా యనెను॥ కామ॥ ౪

నీవే యిందుఁ డీశానుఁ డాద్యంతమైనది ద్దేవతలు నీవణువుకన్న నణువు నీవు గొప్పగను డిభువనావళి కనిన తండ్రివన్ననీవె ఆదివ ధ్వాంత రహితుఁడవు పూర్ణుఁడవు నీవవ్యయుఁడవు సుప్రసన్నశిరోగ్రీవశ్రోత్రవక్షవాక్ఛేత్రి శ్రోణిసజితుఁడవు మా యావాసవసాక్షివి నీవుదృష్టవుశ్రోతవు గుణా న్వితి పంచకోశాతీతుఁడవు నీవనాశ్రయుఁడ వవికారివి భావరహితుఁడవాదిపురుషుండవు ప్రకృతికవ్వలివాఁడవనె॥ కామ॥ ౫

మాయచే నిజరూపమును విడి నరునివలె మహిఁ జూపట్టితినగుణి యంచు నినునిర్మాయకునిగాను దలంచు మహిత ధీయుతుఁడు మోక్షము గాంచు గాన నీయంఘ్రి భక్తియును నిచ్చుచేనేఁగందు నేసినత్సుఖముఁలగందు యోగిధ్యేయ సుజన విధేయశుభ నామధేయ ప్రణతగాధేయ ననుఁబ్రోవు శ్రీయుతాకఘ్రలకునతియవి నుతిఁ జేసినవిభీషణునిఁగని రఘునాయకుఁడు హితముగోరుము యిపు డేమొసంగుదు దనుజకులతిల కా యని పలుక నతఁడు పొంగె॥ ౬

నేనుధన్యుఁడ గృతకృత్యుఁడనై తినినుగంటి నీదయగంటి బ్రహ్మానందము చేకొంటి జగతిలో నెవ్వఁడు ననువంటిఘనుఁడు నేనెల్లసతీసుతసంపదల హరి నీయందే భక్తియుండవలె నంటి నానట్లకానిమ్మన నసురజానిక మదిమెచ్చి నే నెమ్మదిలోనిన్నె నమ్మితినననినవానిమది నీ

తాపమేతుఁడనై నిల్తు నకుటిలుఁడవైనను ధ్యానించిభవజలధి దాఁటు
ష నన్యమీస్తవము దీనిఁబఠించు నతఁడుకోర్కెలుగాంచునని॥ గామ॥

ననుఁగన్న ఫలమిప్పుడే కాంచుమీఁవు లక్ష్మణా లంకనేలింతుజా
ధు జలముగొని తెమ్మభిషేకింతు నేను సిరులు గనర దీవింతు నీకోడనె
దనుజునిచంద్రార్కులెండదాఁక, నిలనాకథయుండునందాఁకనుండు మీఁ
దురాజ్యమును జేయునటంచు మనుజేంద్రుఁడు పల్కి దనుజేశుఁ బట్ట
భద్రునిఁ జేసె మంత్రులతో వానరులలరిరినజుఁడాలిం గనముచేసె విభీ
షణా రావణవధకు తోడుగమ్మని పల్కినకీర్తిసాంద్రుఁడగు శేషగిరీం
ద్రుని సేవయొనరింతమనె॥ కా॥ ౮

౬౨. కాఫీరాగం - ఆదితాళము.

పల్లవి-అళినీలకుటిలాలకా నిస్తులకస్తూరికా లంకృత ఫాల ఫలకా
సఖీ జనతిలకా వినవె॥

అనుపల్లవి-అల పంక్తికంఠుఁడంపశుకుండను నసురుఁడటువచ్చి వినువీ
థినిల్చి పలికె సుగ్రీవ మహారాజ రావణుండునిన్ గరపు
చు నిమ్మాట లనెను॥ అళి॥

చరణములు-మంచికులమున జనించినావుకపి మండలాధిపతివై
నావు ఎంచినా వనుజసమునిగా నిను నెపుడుధనముతోడఁగుడువక పో
వుమోహించి సురలులంకఁజొరలేరెంత మీరనిదశముఖుఁడు దెల్పెన
నె శుకుఁడు॥ వళి॥ ౧

వానరులానుడివిని చంపెద రఘువిరామ దయ చే నివారింపు
మన నభయ మిచ్చితి వెఱవవలదనెను రామ భూనాథుఁడుకపిసేనశు
కుఁడరసి మాద్వారతో నేమందు నినజయనె॥ వళి॥ ౨

వాలిమాయన్న యెటు లట్లనీవు వధకర్తుఁడవనురా పో తులువ
యని లీల నాదిత్యసుతుఁడుపల్కుకవాఁ డేగి రావణునితో నుఘమువాలి

యేయని యదంతయును దెల్పెనువి పాదహృదయుఁడై యుండె దనుజ పతి॥ నళి॥ 3

అటమీఁదట రాముఁడబ్ధియుప్పొంగుట గనికనులెఱ్ఱఁగఁజేసి - కుటిలభృకుటియై పలికెఁగనుఁగొను లక్ష్మణననుఁగన వారాశిది క్తట ము లాక్రమింపఁగడఁగె వీనిమ దమడఁతుఁ గపులు శ్రమముఁబాసి చ టులగతిలడచిపోదురుగా కని చాప మిక్కడిసునాళమ్ముదొడిగె॥ నళి॥

గడగడ వడఁకెను బుడమి దిశలవిసెఁ గడలి దివ్యతనువుధరించి వడిగావచ్చి సన్మణులను రఘువరు ముందరనుంచి నమస్కరించినే జ డుఁడను శ్రీరామ శుభనామ నా యెడదప్పులను మన్నించి జడు దయ గావుకావు భూతపంచకములకు జడిమ స్వధర్మమని పలికె॥ నళి॥ ౫

నీవునిర్గుణుఁడవవికారివి మాయావియాతతివిరాడ్రూపు నీవంగీ కరించి జగముల నేర్పునసృజింతు వార నీవై పులో దేవనీసత్వమున సు రలైరి విధిప్రముఖులకునీవెప్రాపు భావజారి కినుకచేఁబొడమె భవ్యగు ణసాంద్ర రాఘవేంద్రయనె॥ నళి॥ ౬

పుండరీకాక్ష మాయామనుజ తనుండవని నినుఁదెలియఁగలనే దండమే మూర్ఖులకు సన్మార్గ దము పశువులకు మునుకోలవలె నే నిఁకనీదండ చేరితి దండమయా కో దండధారి యభయమిమ్మంకనే నిం దుభక్తిలంకకు ద్రోవయిత్తు నీకనుచు సరిత్పతి వినవిన్నవించె॥ నళి॥ ౭

రిత్తవోదీమహాశరముకనుకిత్తటి గుఱెఁజూపుమని హరి యొత్తి పల్కిన నన్ను బాధించుచు నున్నారుధీరులు ద్రుమకుల్యా మనుదరినా మొత్తముపై వేయు మని పల్కెను స ముద్రుఁడు రఘువీరుఁడు నలరి- సత్తుగ శరము నేయ నాభీరుల రిత్తఁజేసి యపుడెపొదఁజేరెనది॥ నళి॥

చెలఁగివిశ్వకర్మసుతుఁడానలునిచే సేతు వొనరింపు మితఁడుతో లుతనే వరముగొనె నిందుకని పలికి హరికెరగి చనె సాగరుఁడు కడు

నలరె లక్ష్మణకపీంద్రులతో శేషాచలేశుఁడగు రఘువిభుఁడు నలునిజ
లధికి సేతువుగట్టుమని సెల వొసంగెనగచరులు హర్షించిరి॥ న॥ ౯

౬౩. సురటరాగము - ఆదితాళము.

పల్లవి-రామలింగా వృషభతు - రంగాయ సితాంగా॥ రామ॥

అనుపల్లవి-కామితప్రదస త్కరుణాపాంగా కామగర్వభంగా గంగో
త్తమాంగా॥ రామ॥

చరణములు-అమరాచలచాప అజ్ఞానంధదీప సనాతనరూప సు
గుణకలాప అమితప్రతాప శమిత మజ్జనజన్మసంచిత పాపవినుతారాతక
రూప విశ్వనిక్షేప॥ రా॥ ౧

బాలేందు కిరీట భవ్యజటాజూట శ్రీల సల్లలాట శ్రుతిచయ
ఘోట త్రిపురదావకృపీట లీలాహాస నిర్మూలితనిశాట శూలాయుధ
ఖేట సుజన హేమకూట॥ రా॥ ౨

సోమార్కానలనేత్ర సుందరీజన చైత్ర హైమవతీకళత్ర సన్ను
తపాత్ర కామలతా లవిత్రసామజాసుజైత్ర సకలలోక సూత్రశ్రీశత
తచరిత్ర శేషాద్రిశమిత్ర॥ రా॥ 3

తాంతకిట రిమరిస రీతమత ఝే మపధతకుంత ఝంతారితధప
ధమప తాహతనటతక ఝంతారిస్సరిగరీ సనిసరీ సనిధప తాంత కిటక
తక మపనిధపమ ధళాంగుధిమితక దదింగిణతోం॥ రా॥ ౪

౬౪. బిలహరి - ఆదితాళము.

పల్లవి-విను సర్వమంగళా నయసకళా - విజితాంబు దళ శంఖ
సుందరగళ॥

అనుపల్లవి-ఇనకులమణి సేతువు మొదట రా - మేశ్వరు నొనరించి
పూజించి యేమనుజుఁడు సేతుస్నానము రా మలింగ దర్శన
సన్మానముగను నతఁడు పంచమహాపాతకము లను జయిం
చునాదయసటాచుఁ బలికెను॥ విను॥

నరుఁడా కాశీక్షేత్రంబోయి గంగాజలముగొని యరుదెంచి రామే శ్వరుని నభిషేకించి పరఁగజలధిలోఁబొడవైవ బ్రహ్మహాపుఁడౌనని యాకర్ణి తరణికులాబ్ధిసోముఁడు శ్రీరాముఁడు పల్కఁదరుచరులుత్స హించి చలము జెట్టించి గురుగులగతి దొంతరలుగా బయనములును తరగతిగొని తరలఁగా అరుసుగనలుఁడందినాఁడు సేతువొనరిచె నోజబ దునాల్గుయోజనము లిఁక॥ విను॥ ౧

ఇరవై ఇరువైయొక్కటిరువై రెండిరువైమూఁడు, మఱునాఁడు మూఁడవనాఁడు చతుర్థపంచవా సరముల శతయోజనములుకపు లు సేతువు పరువడిగట్టిరి చూడుహరివర పరివృతులయిదా శరథులు హనుమంతాంగదులనెక్కమైబొదల మెరసి సువేలాద్రికిజనికాంచిరి పరిఘ ధ్వజ తోరణాం బధికహిరణ్మయప్రాకారసౌధగృహ వర విటం కమైతనరు లంకం బొంకము॥ విను॥ 3

పదితలలను మణికిరీటము లుంచి చెవుల స్వర్ణకుండలములు వె ట్టిచేతులు గదియరతనాలకడేలు గీలుకొల్పి కలితాంగుళముల నుంగర ములు పదిలపఱచి యొమ్మున వేల్పుటేనుఁగుకొమ్ముపతకమై తనరార ఘనరుచి దేరఁ దిగ్దశులగెలిచిన భీరముతనపాదమునఁ దగుగండపెండే రము చమరుగనుత్తరగోపురముమీఁద దశాననుఁడు కొలువుండె నిం డుమనమున॥ విను॥ 3

పా ఠా ం త ర ము .

చలువ గొడుగుల నీడరావణుఁడు విశాలసౌధమున నుండె యోధవరులతో అపుడు శకుఁడను చారుఁడా రావణుని గని విపుల మౌ దనుజసేనకు కపిసేనకు నెపుడు సంధిగాదు దేవాసురుల వలె నింక నొకపని తడవుసేయకు నృపకుంజరునకు వైదేహినిచ్చుటొండె జగధ మిచ్చుటొండె రాముఁడు సుగుణాభిరాముఁడు విపులాత్మజ నేభ

లముఁగొని యెఱుక దెచ్చితి వాబల మిపుడుజూపు నీసతుల లంక రమి-
యింపు మనినీతోఁ దెల్పుమని పలికెనని॥ విను॥ ౪

శ్రీరామలక్ష్మణులు సుగ్రీవ విభీషణులు చెలఁగినల్వురొక్కచో నున్నారు చూడు వీరె లంక నశింపఁ జేయఁజాలుదురితర వీరులనేకులున్నా రెన్నుచో సారమౌ ప్లవగ సేనసంఖ్య సేయ నాతరమా మేరుమందరతుల్యులయోధాగ్రేసరుల చేరి వినులంక కెదుర్రై పలుమాఱుదల్చుచు ధృతికిఁగుదుర్రై మఱియూథపులు నూఱువేల్గొలువ మెలఁగు నతఁడు దివాకరసుతుఁడనిపలికె॥ విను॥ ౫

ఇతఁడగ్ని నందనుఁడు సేనాపతి నీలుఁడు ఇతఁడు వాలికొడుకంగదుఁడు యువరాజితఁడతుహాంత యా హనుమంతుఁ డీఘనుఁడె సీతనీక్షించిచనె రాముని కడ కితఁడు శ్వేతుఁడు రంభుఁడితఁడు శరభుఁడు పనసుండితఁడు మైందుఁడు ద్వివిదుఁడితఁడు యోధాగ్రేసరుఁడు ఇతఁడు విశ్వకర్మసుతుఁడునలుం డీ బలము లెన్న లేఁడీశుఁడు అతులశౌర్య రతిబలాఢ్యులందఱు చతురులసురవధకుదనుజవర యనియెను॥ విను॥ ౬

ఇరువదియొక వేలకోటు లిరువదియొక వేల శంఖము లిరువదియొక వేల బృందములు సుగ్రీవునిమంత్రి వర సేనలబలము లెక్కవెట్టనా వశముగాదు రేయుఁబగలుఁ బరమాత్ముఁడాదినారాయణుఁడు రాముఁడు పరాశక్తి భూపుత్రిలోకజనయిత్రి లయకారి అనజగముసంభవమాయె వారితో వైరము కొఱగాదఖిలమాతసీతయనినీవు గోరితెచ్చుకొనుట కార్చిచ్చు తెలుఁగనె॥ వి॥ ౭

జలబుద్బుదమువలెఁజంచలము. సంసారము క్షణభంగురము కాయము పంచభూతముల వల్లనై పంచవింశతి తత్వాత్మకమైజడమై పొలుపొందు నట్టిది తెలియమాయముఇలనెవఁడుదీనియందుమమత సేయు-
మలమూత్రములగంపరోతకొంప హాంకృతి తెంప సలుపుచేమిటికి క

లుమేము సుఖా దులఁ జెందునేది యది దేహము కలుగకర్తననుట జీవు నకుజ న్మలయంబు లటుగానమమశలణఁపు మనె॥ విను॥ ౮

అతిశుద్ధమతి నిర్మలమాత్మవిజ్ఞానరూప మచలమవ్యయంబుస్వ జ్ఞానమున వెతఁజెంది జీవుఁడు మోహితుఁడౌఁ గాన నీవు సన్మతిచే నాత్మననిశంబు నుతియింపు దారపుత్రాదులయందు ఁరక్తిఁజెందు - సుతుఁడవు విశ్రవసునకు సుఖముల్ సతమునకు క్షితిసుత రామునకిచ్చి రాజీవాక్షుని మరుఁగుజొచ్చి బ్రతుకుమిల శేషశైలపతి భక్తరావ ణాయనిపల్కె-శుకుఁడా యెడనిఁక॥ విను॥ ౯

౬౫. అసావేరి-ఆదితాళము.

పల్లవి-పోలఁతి యీ చరితము - పోలఁ దిలకింపవే॥

అనుపల్లవి-లలితములొశుకుని - పలుకులువిని పది - తలవాఁడరిగి శి ఖివలెనై వానితోఁబలికెఁ బ్రియమాడిబ్రతికెడి నీవు సిగ్గు లేక జగత్ప్ర - భుని నను బోధింపవచ్చేవిపుడేచంపుదు నిను - గలఁపవధకర్తుఁడవుగావిక దలఁగిపో మూఢుఁడా యన విహ్వలతచేఁ జనె శుకుఁడు మునుబ్రాహ్మణుఁడు వా నప్రస్థగతి నుండె పోలసురలకు మేల్కీడ - సురులకుఁజే యఁగ - సరణి శుకుఁడు సేయు - జన్మములు చెఱుప వజ్రదంష్ట్రుఁడరయ నొకనాఁడా - ధరణిసురునిడాయనగస్త్య ముని యరుదేరఁబూజించి యతఁడారగించిపో - మ్మనముని యొప్పిపాయస్నానము సేయతరివేచి వజ్రదంష్ట్రసురుఁడగ స్త్యుఁడై వచ్చి - తగమాంసాన్నము వేయుమని వేడిన - త్వరగా మాంసమువంటకమువండిరి మునీశ్వరుఁడు భజింప నయ్యెడవచ్చికూర్చున్న తఱిశుకునిభార్యనావేశించిరక్కసుఁ డు మానికినరమాంసమిడి చనియె భ్రమియించి కూడు కూరలుమునిచంద్రుఁడరసి మచుఁడా మిష యోగ్యమిది పెట్టి

తి వనిశపించె నసురనగుమయనుచు నెఱుఁగవని శుకుడరు
వఁగా ధ్యానించి మునిపలికె॥ పా॥ ౧

ఆవిచారముచే నిట్లయ్యెనానుడిదప్పదనఘ త్రేతాయుగమున
రావణుఁజంప రవికులమున హరిరాముఁడై పుట్టెని రధిగట్టుసమయము
న దశముఖుఁడంపఁదవిలి దూతకృత్యమునకుఁజని రాముని దర్శించెదవు
ముదమున నకళంకమా సవనీ సుతత్వము నీ కబ్బునని చనెగుంభ భ
వుఁడు శుకుఁడావిధమున సద్విజుఁడయ్యె నవలమాతామహుఁడగు మా
ల్యవంతుఁడుసవినయమున దానవవిభునిగని రాజ॰ అవనీసుత పురిఁజేరి
నదిమొదలు దుర్నిమిత్తము లొదవె వినాశకరములై మేఘములు గురి
సె నెత్తురుజడి శివలింగములు రోదనముఁజేసెడి కరులకొమ్ములునల్లనై
నవి యాపురీనెఖరముల గని గవిసెనెలుకలుపిల్లితో ననియె॥ పా॥ ౨

ఒకవింతదనుజేంద్రి యొకబోటిమగవాఁడూ రక ఇల్లిల్లుదిరుగు
నిర్భయమున వికటదంష్ట్రినన వివరము దెఱచుచు నిక్కాలమును తె
ఱఁగు విను సీతను సకలేశుఁడగు రామచంద్రున కిచ్చియుమఱుగుఁజొ
చ్చి నను అకుటిలకరుణాఢ్యుఁడై నిన్నుఁగాచు శ్రీహరి రాముఁడైపరఁ
గు నను తత్వము ప్రకటముగా మాల్యవంతుఁడుదెల్పరో షకషాయిత
లోచనుఁడై రావణుఁడుమూ టికి దిక్పతులఁగెల్చినానవనీ దేవముని
రూపుని ఒకపేదమానవుని రాఘవుని శరణొందునా మిన్నకలంచము
లు రిపులచేఁగొని నావేమో గానపొగడెదెవరినిఁకబుద్ధిగాదుసుగు తా
తని మొంచినాపొమ్మనిన నతఁడరిగె॥ పొల॥ ౩

రావణాసురువైభవముఁజూచి రాముఁడు లక్ష్మణుని చేవిలుగొని
యర్ధచంద్రాస్త్రమూవింటఁదొడిగి నింపాఱఁదీసియేయ నదియ సురాధి
పుపైఁ జనియొక్కటిపదినూత్రై వెయ్యి సంఖ్యలనుగడచి పదితలల కిరీ
టములుపడఁగొని వెలిగొడుగుల వేవేగద్రుంచి మావలఁబోదిఁజేరెశర
మూవేళ దనుజాగ్రిణి సిగ్గునగుంది వేవేగనంతః పురవాసమున కేఁగిధీర

రుల రావించి భావించి లావునిర్భయమున సమరోత్సవము సేయఁజనుఁ
డు మదాజ్ఞావిముఖులను రణభయుల బీరమణంతు నసఁగ శేషాచల
దేవుఁడగు రాఘవునిచే ననిఁ దెగినమేలని తలంచి రందఱును॥ పో॥

౬౬. నాటరాగము - ఝంపాతాళము.

ప్రథమయుద్ధారంభము.

పల్లవి-గారీ వచోవిజితచారీ విను శ్రీమిాఱి॥

అనుపల్లవి-శూరులై యనికిదివిజారులేగఁదోరణ భేరీ మృదంగముల్
పృథులశంఖారవముల్ వారకమ్రోయించి మహా మ కర
హరి కరి వాహనముల నారోహించి ఘనవైరి భయద కర
వాల గదా శూల భిండి వాల చాపములు ధరియించియా
యితపడిరి॥ గా॥

చరణములు-అటకుమున్నె రాఘవాజ్ఞచే వానరుల్ పటుఘో
ష భీషణ స్ఫుట శౌర్యులై మహావిటపముల్ బలుగిరుల్ పెకలించుకొ
నివచ్చి కుటిలరావణబలము గూలు రాముఁడు గెల్చుఁ జటుల జయ
మొందు లక్ష్మణుఁ డిసజుఁ డరినోర్చు నిటుజూడుఁడటంచుఁ దలపడి రరు
లతోనప్లుగడుఁబూనికరణమొనరించునార్భటుల హనుమానంగదనీలకు
ముద శర భనలజాంబవ త్సుషేణాది యోధవరులు॥ గారీ॥ ౧

లంక వాకిళ్ళానిలావృమై కపులు ని శ్శంకనసురుల నఖాస్త్రము
లవిదళించఁగా బింకముల్ దనుజులెమ్మయిఁ బల్కనవలిరేఁగి పొంక
మా పురద్వారముల వెడలిరి తోమ రాంకుశశ రాళిచే నగచరులగీలిం
చి అంకెలువేయఁగనిప్లవగులహితులబీరంబడంచి రాజిస్థలిని బహు పం
కమయి మేదో మాంస రాశి నెత్తురు పంకిలమైపరఁగె మహాద్భుతము
గ నయ్యెడను॥ గారీ॥ ౨

మరలిదితిజుల్ కరుల హరుల దేరుల నతిత్వరగఁబూరికొల్పిసంగర
కేళిసల్పిర త్తఱివనేచరులు నట్లనపేర్చిరి జయేచ్ఛఁ వేగమును బలము

నుగల్గి వేగముగ నమృతముగొనిన సురలవలె రావణాసురుఁడల సీతా చోరుఁడయిన పాపమువలన నిశిశరుల దొరలు దొరలిరిలఁ జతుర్థాంశ శేషసైన్యముల్ బఱచె భయధృతంబులయి కలఁగి॥ గారీ॥ 3

తనబలములిట్లాటఁగనికనతోక-పుఁడై ఘనుడింద్రజిత్తుమే ఘములలోదాఁగి క్రిన్ననశితాశుగవితానముల్లోలివర్షించె వనజసంభవుని వర మునఁ గన్న బ్రహ్మాస్త్రమున మర్కటానీక ముల నెల్లఁబడ నేసె దినకులమణి కోదండదీక్షాగురుఁడ య్యును బ్రహ్మాస్త్రమును మన్నించిత క్షణమూరక యుండిస్వబలముల్ గూలు టరసి యనల సన్నిభ జ్వాలద్భయద నేతుఁడయ్యె ధనువుఁ దే లక్ష్మణా దనుజు భస్మీకరింతును బ్రహ్మాసాయకం బునఁ జూడు నాబలం బని శేషాద్రి పతిపల్కిన వాఁడుచనె నంతవనచరుల్ బడుట గనుఁగొని రాముండడలి యో హనుమంత క్షీరాబ్ధికావల దివ్యౌషధిజనకమగు ద్రోణనామగిరి గలద దివేఁ గొనివచ్చి కపులబ్రోవు మనఁబావనిదినమునఁ వని తెచ్చి వనౌకసుల సజీవనులచేసి నగమమున్నటివలెనిడి వచ్చి॥ గారీ॥ ౪

౬౭. ఆరభిరాగము - ఆదితాళము.

పల్లవి-సారదయా ధురీణ సంగిత విద్యాప్రవీణా వినవే॥

అనుపల్లవి-ధీరులైన విరుల్ చెలఁగి భీక రారవముల ను ఱంకెలువైచి మీఱిన దివి ని రావణుఁడు మదిని నారసి వందురి రాముండు నాకెన్న దేవతానిర్మితుఁడయిన వైరి బోరనతని జంప యూథపులెల్లఁ బొండిటు సేయని వారిఁ జంపుదున నేను॥ సార॥

చరణములు-రావణానతి సబలులయి చని ధూమ్రాక్ష యూపాక్ష శోణితాక్ష మహావీర మహాకాయ ప్రహ స్తాకంపన మహోదర మహాపార్శ్వులు దేవాంతక నరాంతక కాతికాయ త్రిశిర ప్రజంఘ కుంభనికుంభు లావనచరౌఘముతోఁ దలపడిరా రావీరియద్భుత రా

ద్రిరసములే మనందగు గదా ముసలాశుగక్షురీ విశేష సాధనాళిచే వి
దళించిరి దానవులు కపిసేనాపతుల॥ సా॥ ౧

మర్కటుల్ బలియురయి కొండలఁ బెనుమ్రాకులఁ బండ్లగో
ళ్ళఁ బిడికిళ్ళఁ గర్కశ పదఘట్టన శిలోరు కర కపోలోదరముఖాంగ
ము లగల మార్కొని మోదికఱచి జీమిరిచి తన్నిరనవేగ నసురులెదు
ర్కొనన్రైరి వైచి లంకకైపాఱిరి కుర్కుర శబ్దముల బలీముఖుల్ కొ
లంది నాఁబడక బల్తఱిమిన ప్రహస్తుఁ డర్కకులచంద్ర ముదితాగచ
ర బలాంబుధిఁ జెల్లెలికట్ట కెవడినిలిపె॥ సార॥ ౨

ఒకనిఁబదింట నూటవెయ్యింట వనౌకసుల నొక్కొక్కములికిఁ
గూల్చి నికషాత్మజమంత్రి జయప్రశస్తిఁ నెఱయసీలుఁ డదలించి పేర్చి
కడిమి నొకతరుపుఁ బూని వాని తేరుమీఁదికిం బోయి సూతుం జంపి
హయముల మకురడంచి విలుద్రుంచసీల నిలిచితిఁ కనునొందఁగ నాగ
కేతనుం డిభంబుగతి రోకట నడుప సీలుఁడొకట సొలసి తెలిసి పెఱగి
రివైచి యురువడి రావణమాతులుఁ బొరిగొనియె॥ సార॥ ౩

తలలువీఁడ రక్కసుల్ బర్వఁగని తారాసూనుపై నరాంతకుఁడు
చలమున హయముదోలిరక్తినేయఁ జలమున నంగదుఁడు వాజిపడనడ
చెఱ తలఁకొందక వాఁడురస్థలిం బిడికిటఁ వ్రేయసోలి వాలికొడు క
టఁ డెలివొంది ముష్టిఁ బొడువఁ గుంది పొలిసె నరారియు దేవాంత
కుండ ప్వడంగదుని దాఁక హనుమంతుఁడాఁ కలిగొనినబులోయనఁ
యెడఁజొచ్చి ఘనుండగు దేవాంతకుని రూపమడంచె॥ ౪

అంతకాభీలుఁడగు సీలుండుపెల్లార్చ మహోదరుం డదల్చి త
న దంతిని డీయని డీకొల్పి రిపు తాటించినఁ గపిసేనాపతినొచ్చి పంతం
బు మీఱనగంబు గొని సత్వరంబుగ నేయ కరితో నొరలి గంతుఁ
గొనె మహోదరుం డంత నె జంత్రిమనఁ ద్రిశిరుం డనిలసుతుని శ

రామ్రుతు నీఁజేయు సతఁడరద మిం తింతలుగఁ జేసి వారివమాఁదు తల
లిల గూల్చెఁ వజ్రిగిరింగూల్చులాగున॥ సార॥ ౫

అంజనీతనయుని గదఁగొని ధూమ్రాక్షుఁడేసిన బిట్టలిగి నృప
కుంజరుఁడు రుక్శైలము దెచ్చి వైవఁగూలె వజ్రదంష్ట్రుఁబడు బలుని కరణిఁ
గెంజాయకనుల్ ముడివడిన బొమల్ పెంజీకటినేలు మైతొడవుల రం
జిలిన కంపనుఁడు తేరెక్కి వెస శింజిని మ్రోయించి పావనిమెయి శితా
స్త్రములఁ జిందఁగ సకోపుఁడయి ప్రభంజనాత్మజుఁడు మ్రానిచే వాని
భంజించెఁ దేవతలు జేజే యనఁగ॥ సార॥ ౬

గదఁబట్టఁగ ద్రిప్పి మహాపార్శ్వుఁడు కాలాగ్ని సన్నిభు రుషభు
నేయఁ జదికిలఁబడి మూర్ఛిలి తేరి యామ్మ్ పృథుల కీశవరుఁడు పోఁడువ
వాఁడీల్గెఁ విదితుఁడయి మహాకాయుఁడరదంబు వెసఁబఱపి సజ్యకా
ర్ముకుఁడయి చెదరకుఁడి కపులారా వినుఁడీ కదనము వీరాగ్రేసరుఁడగు
రాఘవేశుతో గాని సేయ తరమా మాతండ్రి దివిజులఁగెలిచెఁ గైలా
సమెత్తె నేనటు గావున నలతి గానని పల్కె॥ సార॥ ౭

అంగదుఁడు మహాకాయుని గని యూహా రజ్జులేల మాయయ్య
నునె ఱుంగుదుతోఁకను జుట్టి పయోధిలో ముంచఁడె మాతండ్రి ము
న్నటుఁగవా వెంగలీ యనుచుఁ బాదపము వైవ విశిఖంబునఁ ద్రుంచి
బాణవృష్టి నంగదు ముంచి గదఁగొని సొలయఁగ చొంగదొరంగ పడెఁ
గపులడలఁ సురారి మొదింట బడిట నొకట జెలఁగి మూట నూట నల
నీల గవయ గజ గవాక్షానిలసుతాదుల నేసె॥ సార॥ ౮

అంత నంగదుఁడు తెలివొంది ఘన గదాయుత భుజుఁడయి మ
హాకాయు రథాంతరమునకుఁ జని హరిసూత కేతన చాపముల్ నుఱు
మాడె నిర్వురు గదల్ వింతఁగాఁ గొనిపోర నపి పోట్లాడ్రు యు వియన్ మ
ల్లయుద్ధమున దుందుభి నంత మొనర్చిన వాలిదాలాపువకు సరిగానద్దను

జుక్ బాఁకిచి పడి౯రణోర్వినిదెవ్వి శ్రీరఘురాము చెంత కేఁగి మ్రొక్క
న వాలిసుతు శేషగిరీంద్రుఁడు గాఁగిలించెను జెలఁగి॥ సార॥ ౯

౬౮. శ్రీరాగము - త్రిపుటతాళము.

అతికాయు యుద్ధము.

పల్లవి-ఆర్యసమ్మతమైహితంబగు నార్యయీచరితము వినవే॥

అనుపల్లవి-శౌర్యఘనగాంభీర్యసమరచాతుర్యాది నహాయుఁడయి య
తకాయుఁడైశ్వర్యవిభవము లనుసరింప న వార్యమయి గు
ణరవముమ్రోయఁగ సూర్యానిభ మగు రథముఁ బఱపి య
సురావళి నోడకుమని పలికె॥ నార్య॥

చరణములు-బాణాసారమున వనచర సేనానాయకుల తుళ్ళ
డఁగించి సేనానాథులఁ జంపక రామ క్ష్మానాథుని నెదిరి సుజ్ఞానమూ
హించి రావణసూనుఁడదలించి మానమే లేమ ఏనెలవు గాదు ఏనీతి
యురాదు మాతో వాదు బూనిమానిసివయినావు గుణహీనుఁడవు కుల
గోత్రమెఱుఁగని వానికిపుడోద వెనిన్నియును సమానుఁడవె మాతోనని
పలికె॥ నార్య॥ ౧

మీనై యంబుధిచొచ్చినా గాని చట్టుమోసినాగాని క్షోణికొ
డీకరించినాగాని మానెక్కపండ్లిగిలించినాగాని భిక్షుఁడవయినటించినఁ
గాని గూనిబాపడవయినాగాని దొరతనముమాని మానివయినా ముస
లివయినా గాని శాంతిగొనిపోరుమగఁగఁ గలికినయినాగాని నినుబోనీను
నీమీఁద నిడిన తలఁపు మాననని హరితో నసురవరుఁడు॥ నార్య॥ ౨

జ్వాలభీలంబౌ దావాగ్ని లీల లక్ష్మణదేవుఁడెదిరించి మేలరా
పడుచ రజ్జులుచాలా పేలెదవు చక్కఁగా నిలువు నీకొవ్వడంతు శే
శేలలర ననిన చాలు సౌమిత్రిగొలువు పె క్కాలముల తెలుఁగు నెఱ
గవు జరుగు కాలభుజగాభ శరజాలము పాలుగావలదనుచు నుద్వేషా
ఛ్ఛమున నెత్తురొలుక వాలమ్ముగీలించె లక్ష్మణు॥ నార్య॥ ౩

దానవబల్ మెచ్చి యీఘనుం డే నన్నోర్వఁగఁ జాలునని యంబ
వానచేముంచె రావణి రామానుజుఁ డతఁడస్త్రానలముచే దానిమాన్పి
పగవాని మైతూపుల వేనవేల్నించఁ గానిష్ఫలమయ్యె హీనునకుఁ జేసి
నమేల్ కరణినా లోన పవనుఁడు వచ్చియజుచే దానవుడు వజ్రకవచ
ము గొనిపూనెనని తెలిపిన రఘుకులుఁడానిశాటుని కవచముదునిమె॥
నార్య॥ ౪

ధీరుల్ దానవ మానవ రాజ వీరుల్దివ్యాస్త్రముల్పరఁగించి పే
రలఁ హరిహరి కరికరి నెరసిన పరుసున పిరుదివియక గెలుపు నుబ్బున
బోరి రరుదారఁ ఘోరశరక్షత శరీరులై గైరికాభరక్తశైలములన నొ
ప్పిరి కలన నారి నరి వోసి బ్రహ్మాస్త్రము దార మంత్రాన్వితము గా
నిండారఁదీసి మనుకులుఁడేయసురారిసుతుతలదునిమె దుదినది॥ నార్య॥

ఆలో దేవతలానందమునఁ బూలవానలు గురియించిరి చాలా
భక్తినుతుల్ చేసిన తమ్మునాలింగనముఁ జేసి మైనిమిరెఁ గరమున ద
యాలోలుఁడైన హరి బాళిగపులునుద్వేల హర్షాబ్ధిదేలిరదిచూచి సైఁ
చక నేచి కాలయముఖులనఁ గుంభనికుంభు లోలి రణకేళి నగచరులఁదో
లి తరిమినవారిఁజంపిరి వాలితమ్ముఁడు నతని కొమరుఁడు॥ నార్య॥ ౬

యూపాక్షుండు ప్రజంఘుఁడు మైందుతో పోరాడి రణోర్విఁ
గూలిరి కోపోద్దీపితుఁడై శోణితాక్షుని రూపఱ ద్వివిదుఁడు బొడిచి పా
దమునఁ బ్రామెఁ బ్రతాపమనువొంద బాపురేయని ధూమ్రాక్షుని
హనుమంతుఁడేపునఁ దెగటార్చి యార్చెను జేర్చి ఆపదలఁబడి పఱచి
హత శేషాసురులు రావణున కెఱుఁగఁ రూపించి రతికాయాదు లీల్గుట
యును శేషగిరీశునిరాముని జయ॥ మార్య॥ ౭

౬౯. గౌళరాగము - ఆదితాళము.

రావణుని ప్రథమయుద్ధము.

పల్లవి-సూరిజనసౌఖ్యదాయినీ యీ సుచరితము సుధీసువ్రతము కాత్యాయనీ॥

అనుపల్లవి-పోరనతికాయాదిఘనుల్ బడుట కాంరాటపడి రావణుండు కనుల్ సమీరసంయుతాగ్ని నెనయుగా ఖరారిపైఁజనఁగా మదినెంచివగమీఱ నింద్రజిత్తులంక కాపాడన మిద్దురితంబ యిబలంబునడువఁగ భూరిసాయుధమగు రథమెక్కి పోగరున నిక్కి నడచెను దొరిక్కి॥ సూరి॥

చరణములు-వింటగొనయమిడి కపుల నదరంటశరముల నేసి చంపి దంటయగుచు నినసుతాదుల వెంటనంటి మంటలడతు నారాచముల చే మదమడంచి బెబ్బులిపేరాఁకట నొంటిఁ బడివచ్చు పోల్కిదశాన నుండు హరిగద సెసదిగని త్రిదశకంటకు నెదిరివిభీషణుఁడుగదా కనద్బాహుండై దాఁక నతనిపైనంటిన పగ మయదత్తశక్తిస న్నసశక్తి నేసె సుయుక్తి॥ సూరి॥ ౧

అయ్యస్త్రముగనినాచేసర మియ్యెఁబహునతఁడు వధకుదగఁడయ్యాయని సౌమిత్రిస్నపు నెయ్యమెటంగిచయ్యనఁ బిరిందికి విభీషణు నెయ్యఁదిగిచివి ల్గొనియనికిగరియ్యుండై నిలశక్తివచ్చి నరేంద్రసుతుఁజొచ్చివెలిఁగెను హెచ్చిడయ్యఁడెయ్యె సకలశక్త్యాశ్రయుం డనంతుఁడు హరికి తగునను్ప నతనికెయ్యది దుర్భరంబెటులైన యిలఁబడె దానవరభావన॥ సూరి॥ ౨

సోలఁబడియున్న లక్ష్మణుని చాలి కరములనెత్తఁబోయి వ్రాలి రావణుఁడు సిగ్గుపడె జాలిజగతిమూలమై తగువిరాట్పురుషుఁడై పొదలు విష్ణుగదలపఁగ సురారి కేలీల నగు రావణుఁగనియె కింతలోనఁ జవిపావని యశనిఁబోలుపిడికిటను బొడువమోకాళులుభువిఁగ మోదఁబడి ఇ

లేఁడు ముక్కులన్ జాలరుధిరముగ్రక్కలక్ష్మణున్ సామీరిఘనుండై కొనిచనెను॥ సూరి॥ 3

రామత్మనాథుఁడనిలజుని సామర్థ్యముఁబ్రియముగనిపొగడి భీమాటోపమునధనుర్ధరుండై మారుతి నెక్కి కొంచుగెలుచునాఁటిరుద్రునివలె గదియఁదెలిసి దనుజకిరీటిమహామర్షణమునఁదే రెక్కి రాఁగను నరాధిపుఁడు బాగా అదల్చిపోరాదైత్యాధమా బ్రదికిపోతే న పరాధము సర్వసముఁడనైననా కేమిటికిఁ జేసితివి నినుభళీయిలకిడుదు బలిగననెఁగడుఁగెరలి॥ సూరి॥ ౪

శ్రీరామునినుడివి వాహన మైరాజీలు హను మంతునేసెసు గూరాస్త్రములరావణుఁడు కినిసివానరాగ్రణినెచ్చి భూరి తేజో బలంబునవృద్ధి బొందెఘృతముచేనగ్నివలెన్ రఘువీరుండపుడంజనీకొమరుని వివిక్తసవ్రణునిగని రావణునితేరు గుఱ్ఱములు గొడుగువిల్ సారథి కేతువ్రుద్రించి యర్ధచందురు లకోరియలఁ బడల్చెకిరీటము ల్గూల్చెర విసముల్లసత్ప్రభముల్॥ సూరి॥ ౫

బాణావళినెచ్చినావిపుడు ప్రాణాలతోఁ బోశ్రమదీఅఁగోణాధిపానాబలమరయ జాణవై రేపురా కానీ యనీ నృహరివలుకవాక్యాండములనునెచ్చి డగ్గరి కరేణు పతిమృగపతిచేఁబడి యరిదివిడువఁబడిపఅచుకై వడిమానమేది రావణుఁడు పాటి కడునడిక్ లంకఁజొచ్చె మదినెంచె నాశ్రీనివానుఁడే రాముఁడు ధరణి శేషగిరి ధనియనంబరఁగెనని॥ సూరి॥ ౬

## ౭౦. తోడి - అటతాళము.

పల్లవి-కామసంజీవనౌషధికల్పలతా - శ్రీమేన కాసుతా వినవే॥

అనుపల్లవి-ఆమీఁద వగచె రామచంద్రుండు హాలక్ష్మణా హా యని విలపించెను॥

చరణములు—తానువిష్ణుఁడైననుమాయ చేనుజగమునెల్లనుమో హింపఁగానుమదినెంచి నెవరుమించితిక్షోణిపైఁబడి మూర్ఛసుక్కియు న్నవానిజూఁచి కన్నీరునించి నానోముఫలమా నాపెన్నిధానమా నా నీడ నాతోడ నేనీతోడఁ బూనిరాఁదలఁచి నినుఁ బిలిచినగాని పల్కవ దేకోపమా నేనన్యుఁడనే కరుణజూడగదే నన్నుగన్ను లలరఁగననె నృహరి॥ కామ॥ ౧

అంతరాముఁడు చింతాకులుఁడై ధీమంతాయో హనుమంతా రానా సంతాపముదీర్చుమా సంజీవనిఁ బంతముతోఁ దెచ్చి ప్రాణములి చ్చియీఘట్లతమ్మునిజేర్చుమా మంతుకెక్కునీమహిమమునకొంతదేపా వనిమ్రొక్కిచనె నా చక్కినంతయును జారులవలనవిని యసురపతి కా లనేమి గృహాభ్యంతరముఁ జేర వాడతనిసపర్యలఁ దనిపి కార్యమేమని యడిగె॥ ౨

రామానుజప్రాణమీమారుతి దివ్యసామద్రికిఁబోయె నామార్గ ముఁవిఘ్నమూమాయలుపన్ని యీ రేయిగడుపునీమేలుమఱువన నుద శాశ్యునికాలనేమిబోధింపనెన్ని మామారీచుఁడేమాయె నట్లనె నేన నుమానమేమి రావణానీజీవనమేమిహితనుతపౌత్రిబాంధవ్రు లీల్గిరవనిజ చే నేమి తనువేల హరికినిచ్చి సీతనీరాజ్యము విభీషణుని కిమ్మనెను॥ కా।

మునివైయడవికిఁ జనివైదికకర్మఘనుఁడై విజనస్థలివై తగునునికి గొనివైరాగ్యమున విషయాసక్తిఁ జనునింద్రియములమెల్లనడిగిచిపర మాత్మనెనయించి చిత్తముననిను ప్రకృతికివిలక్షణునిగాఁదలపోయు మనఘ చరాచరజగముబుద్ధ్యాదికములను బడెడిదేడిదిచతురా ననుఁ డుమునుతృణముతుదయా నిదివిను ప్రకృతిజన జననలయ కారణమ దియెమాయ యనఁబడునెనెనతఁడు॥ కా॥

శ్యామారుణశుక్లధామాకృతిఁ బ్రజల నామాయసృజియించి కామక్రోధాది నామాద్భుతసుతులను హింసేచ్ఛాది భామినులఁగని

యదిబహు బాళిఁజెందించఁ బరమాత్మ నీగతులను ఏమియొల్లనియా త్మేశునందదిస్వగుణస్తోమము నారోపించుదీపించు స్వామి నిర్మలుఁడైన ను బ్రకృతి సంగివై వెలిఁగని బ్రమసి తనుదామఱచి గుణ మోహి తునిఁగా దలఁచితనుదెలియుక్రియ వినుమనెనతఁడు॥ గా॥ ౫

ఏకాలమునవివేకాఢ్యుండైన శ్రీకారణగురుని చేకాయికమో హాశోకాదికములేనివానిఁగా దెలియం జేకుఱునత్తఱిమరల్చిచూడ్కిఁగ ను నాత్మజీవన్ముక్తుఁడై ప్రాణి ప్రాకృతగుణములచేఁ బడకనీవు నిన్ను- పరిశీలించుయతూనికశితూ కరుణదక్షుఁడవై ప్రకృతి కవలివెలుఁగని యాత్మను దెలియ నీకౌదవు ముక్తియదిబళువే ని సగుణాత్మధ్యానము ను జేయుమనె॥ కా॥ ౬

ఉదయార్కోజ్జ్వల హృదయా బ్జకర్ణికా భ్యుదయాసనమున స దయామతి సీతగదియ నలరునాస కన్గవయుదుగై పొదలువాలి మెఱు పు బోలుచేల నానికదలునందెలవానివిదిత వనమాలాన్వితునిగఁ గౌ స్తుభహారాంగద కటక కిరీటుని వీరాసనునిముదమొద వకేల్దోయివి ల్లమ్ములఁ దాల్చికొల్చు లక్ష్మణుతో సదరహాసముగ బల్కు రామ చంద్రుధ్యానింపు మధిపా యనెనతఁడు॥ కా॥ ౭

ఈరీతిగ హరిచారిత్రము వినుము చేరిశుభములవ్వారి క ర్మా నుసారిగావచ్చిన దురితౌఘములు తొరిచెడుఁ గార్చిచ్చుదారిలో మీాఱి కంటకమునిల్చి హెచ్చునా మారవికార పౌలస్త్య వీరవైరముమాని భక్తిఁబూని శ్రీరాముఁ బరిపూర్ణు నెకసిసదారూఢభావ భావితుని శ రీరనామ రహితుని శేషా దినివాసుని దలఁపు మనె మారీచుఁడు॥ కామ॥ ౮

౭౧. కన్నడరాగము - ఝంపాతాళము.

పల్లవి-శరణాగత సంభరణా - వరకువలదళనయనా కృతతుహిన
కరచండకిరణా వినవే॥

అనుపల్లవి-పరతత్వాశ్రయమహాత్మ్యాద్వయసుధాత్వ - సరణిబల్కు - కా
లనేమిపయిన్ రావణుఁడు కెరలితప్తఘృతంబునజలంబు వ
డినక్రియ - మెఱసినినుఁడు గ్రింతు నామాటమీఱితి పరుల
చే - లంచములు గ్రహించిరామకిం - కరుడవై గురుని
పోల్కి బోధించెదవర రేయనఁగినుకవల దంచుగది లేవాఁడు॥
శరణా॥

చరణములు-హిమవన్నగపార్శ్వమున వసమురచి యుంచికాలనేమి మునివలెనుండెను మించి సమీరసుతుని భ్రమింపఁదలంచి అమితజవంబునను గపివంశమణివై హాయసాధ్యుఁడై యేఁగుచోఁబుష్యాశ్రమముగని తెమలితోఁ గ్రివ తోలంగెననికలంగి యీసంయమినడిగిపోదమనుచుఁ బోయితత్పాదములకు మ్రొక్కి దేవరామభద్రమూలను హనుమంతుండనఁదగువాఁడ దృష్టాతురుఁడఁనుద కముఁజూపు త్రావిపోయెద ననిపలికె॥ శరణా॥ ౧

అమృతోపమమహా కమండలముతోయంబు ద్రావు ఫలనిచయంబు దినువినుతంబు నమంత్రముగనిత్తు నౌషధంబు సమరతలంబు నఁబడిన లక్ష్మణుఁడెలమి సమరసర్వకాలవేత్తయనగాఁ దెలిసెను శ్రిమముదీర్చుక రేపు బొమ్మురే పకడనని తమకమునమానిపలుకగుంభజలమల్పము కొమరున సరస్సునవటునిఁ బంపిచూపింపు సుమహితయును పవమానసుతు వెంట శిష్యునం పి మడువుఁజూపి రమ్మనెఁ గపటముని॥ శరణా॥ ౨

కొలనాద్విజుచేననిలజుఁడు గాంచి కోర్కెమించి కనులు ముకుళించి ప్రవేశించి జలంబుద్రావెను సంభ్రమించి బలుమకరిమ్రింగెను హరిప్రవరుండు తడబడక తనహస్తములనదువక వెస మొసలి తలబగిలి మృతరైమదవతిరై చూపట్టె బలియుఁడ భవద్దయను శాండిల్యుశాపము పాలిసె నే ధాన్యమాలినియనన్ సురాంగనను ఖలదుష్టుని

